

శ్రీ పిఠాపురము రాజాగారగు

శ్రీరాజా రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు

బహద్దరుగారు.

శ్రీ

# విజయేంద్రవిజయము.

ఆదిపూడి సోమనాథరాయ

ప్రణీతము.

మొదటికూర్పు 500.



కాకినాడ:

సుజనరంజనీముద్రాక్షరశాల.

1911.



**Price 12 Annas.**



# విన్నపము.

---

అభినవాంధ్రభోజుఁ డనందగు శ్రీ పిఠాపురము రాజాగారు నూతనముగా నీసంవత్సరమునుండి యేర్పాటుఁజేసిన యాంధ్రప్రబంధపరీక్షకుఁ బంపునిమిత్తము మిక్కిలి యుత్సాహముతో నీ ప్రబంధమును రచించితిని. నాగృహకృత్యములయందుఁ గొన్ని యనివార్యములు తటస్థించినందున ఆగస్టు 5 వ తేదిని బ్రారంభించి యీ ప్రబంధమును 26 వ తేది రాత్రి 8 ఘంటలకు ముగింపఁగలిగితిని. కాని నియమితదినమునకంటె నొకదిన మాలస్యమైనందున నాయీ ప్రబంధమునకు నాపరీక్షలోఁ జేరు సౌభాగ్యము గలిగినదికాదు. కాఁబట్టి దీనిని నేను స్వతంత్రించి ముద్రింపించితిని. ఏలాగైననేమి శ్రీరాజాగారి ప్రకటనయే నాకీప్రబంధమును రచించుటకుఁ బ్రోత్సాహమును గల్గించినది గనుక నేనెంతయు శ్రీవారికిఁ గృతజ్ఞుఁడ నై యున్నాఁడను. దీనిం జదువువారు దీనియందలి గుణములనుమాత్రము గ్రహియించి దోషంబులను బరిత్యజింతురుగాక !

ఇట్లు విన్నవించు
సజ్జనసేవకుఁడు
ఆ. సోమనాథరావు.

పిఠాపురము
1-9-11



శ్రీ

# విజయేంద్రవిజయము.

## ప్రథమాశ్వాసము.

శ్రీ కరుణా సుధారసముఁ • జిత్తసరోజమరంద ధారగా
శోకనివారణైకపరి • శుద్ధప్రసిద్ధ మహౌషధంబుగా
శ్రీకరధర్మసారముగ • స్త్రీపురుషాళి కభీష్టవృష్టిగా
లోకమున న్వధించినతి • లోకవిభూ! పరిభూ! మహాప్రభూ! 1

చ. అనికరుణా సముద్రుఁడగు • నప్పరమేశునిఁ బట్టభద్రుఁగా
నొనరిచి మానసంబునకు • నుండుతఱిన్ దదనుగ్రహంబునన్
ఘనకవితా సుధాలహరి • గ్రక్కున నమ్ముఖ గహ్వరమ్మునన్
గనదుర వేగవంతమున • ఖండముగాఁ బ్రవహింపఁ జొచ్చినన్. 2

ఉ. అందఱుఁ బ్రీతితోఁ జదివి • యార్యపథైకవిహారు లౌటకున్
సుందర కావ్యరత్నముల • సూరులు మెచ్చ రచించినట్టివా
రందఱి పాదధూళికిని • హర్షముతోఁ దలయొగ్గి లోకులా
నందముతోఁ బఠింపనొక • నవ్యప్రబంధముఁ గూర్పనుండుచోన్. 3

ఉ. నీతిఁగథాచమత్కృతిని • నించిను కావ్యముఁ గూర్పుసత్కవిన్
ప్రీతిని గౌరవింతునని • పీఠపురాధిపుఁ డాంధ్రపత్రికా
వార్తమున న్లిఖింపఁగని • భాషనుపుత్రునిఁ గాంచె నంచు నా
చేతమున న్దలంగుచు వి • చిత్రగతిన్ రచియించితిన్ గృతిన్. 4

తే. ఇట్లు పరమేశు కరుణచేఁ ♦ గృతిరచించి
యాంధ్రలోకంబునకు నెల్ల ♦ నబ్జమిత్రుఁ
డనఁగ నొప్పారు సూర్యరా ♦ యావనీంద్రు
కొల్వుమదిలోనఁ గల్పించు ♦ కొనిముదమున. 5

సీ. శ్రీమంగమాంబాశ ♦ చీగర్భకలశర
త్నాకరజనితము ♦ క్తాఫలంబ
రావుగంగాధర ♦ రామరాట్ప్రేవేంద్ర
పావనదవ్యత ♦ పఃఫలంబ
చిన్నమాంబాసతీ ♦ చిరసముపార్జిత
వరపరమేశసే ♦ వాఫలంబ
పద్మనాయకవంశ ♦ పారిజాతోత్పన్న
శ్రితజనావనసురు ♦ చిరఫలంబ
యమలభక్తిప్రపూతధ ♦ ర్మావలంబ
గురుజనస్తూయమానస ♦ ద్గుణకదంబ
దీనసంతాపశమనమ ♦ హానదంబ
సూర్యరాయా! పిఠాపురీ ♦ శుభఫలంబ. 6

తే. నీకుఁ గరుణాసుధాబ్ధి త్రి ♦ లోకవిభుఁడు
సర్వశుభములు నిడఁగ నా ♦ శీర్వదించి
వింతఁగొల్చెదు విజయేంద్రు ♦ విమలచరిత
వినుతు వినుమయ్య విమలధీ ♦ వేకవిభవ. 7

క. అనుచు న్నృతిపతిసంబో
ధనమున్గావించి పరమ ♦ తాత్పర్యముతోఁ
వినయము దళుకొత్తంగా
వినిపించినయచ్చరిత్ర ♦ విధమెట్లన్నన్. 8

## కథాప్రారంభము.

సీ. శ్వేతకిరీటమై • చెన్నారునెద్దాని
శీర్షభాగమ్మున • శీతనగము
ఆణిముత్తెమ్ముల • హారమైయెద్దాని
కంఠాననొప్పుగం • గాభవాని
కమనీయతరమైన • కాంచియైయెద్దాని
కటిఁగ్రాలు వింధ్యన • గంపుఁజాలు
చిత్రచేలంబయి • చెల్వొందు దేనిపై
సర్వసస్యాఢ్యయౌ • సారభూమి
దేనికాలూనుపీఠమై • తేజరిల్లు
సింహళంబనుదీవి ద • క్షిణమునందు
వీచికలదేని నిరువంక • వీచువార్ధి
యద్ది భూమండలికి రాణి • యార్యధాని. 9

క. ఇందుఁగల రాజచంద్రుల
నందఱ బవరాననోర్చి • యార్జించినయా
నందమున మగధ నేలెను
మందారాఖ్యుండు కీర్తి • మందారుండై. 10

తే. ప్రజలపాలిక్కి స్వర్గమై • పరఁగునట్టి
పాటలీపుత్ర మనియెడు • పట్టణంబు
దనకుఁ దగు రాజధానిగాఁ • దనరుచుండ
రక్షవహించెను మహిని నీ • రాజరాజు. 11

చ. అతులపరాక్రమాది సుగు • ణావళి కెంతయు మెచ్చి సార్వభూ
పతిసుత సర్వమంగళ వి • వాహవిధిన్ వరియించె నానృపున్

బతి సతు లిద్దఱుం గలసి ♦ పాయనిమైత్రి మెలంగుచుండ దం
పతు లన నిట్టు లుండవలె ♦ బాపురె యంచువచించి రందఱున్.

ఉ. అంతఁ గృపావతంసుఁ డగు ♦ నప్పరమేశుఁడు వారినెంతయున్
సంతసమందఁ జేల్చ నొక ♦ చక్కని కూఁతు నొసంగె దాని ని
తింతనరాని ప్రేమమున ♦ నిర్వురుఁ బెంచుచునుండి రంతలోఁ
గాంతకు సర్వమంగళకుఁ ♦ గల్గెను దీరనిరోగ మక్కటా! 13

తే. అంతకంతకు వ్యాధిదా ♦ నతిశయించి
రాజయక్ష్మగ మాఱిన ♦ రమణి యపుడు
మరణ మాసన్న మగుటను ♦ మది నెఱింగి
చెంతఁ బాయకయుండెడు ♦ కాంతుఁ జూచి. 14

ఉ. కన్నుల నీరునించి కర ♦ కంజములన్ముకుళించి భక్తితో
నన్నుఁ గృతార్థఁ జేసితిరి ♦ నాథ భవచ్చరణాబ్జసేవ నా
కెన్నఁడు గల్గు నింక నని ♦ యేడ్వఁ దొడంగిన భర్త యార్తుఁడై
యెన్నఁగరాని శోకమున ♦ నెంతయుఁ గుందుచు వ్రాలె నేలపైన్.

ఆ. అంత నచట నున్న ♦ యమ్మహీకాంతుని
చెల్లెలైన భద్ర ♦ చెంతఁ జేరి
వదినె యేమొ చెప్ప ♦ వలెనని యున్నది
వినుము లెమ్మనంగ ♦ విభుఁడు లేచి. 16

క. పలుకవె మద్హృదయేశ్వరి
పలుకవె నాప్రాణమేనిఁ ♦ బడఁతీ యిట్టుల్
బలుకవె నీకడ పలుకులు
నిలుకడతో వినెద నిదిగో ♦ నిర్మలచరితా. 17

తే. అనుచుఁ గన్నీరు రాల్చెడు ♦ నవనివిభునిఁ
జూచి పొదిగిట నున్నట్టి ♦ సుతను జూపి

నాకుమాఱుగ దీనిని ♦ నాథ నీవు
భద్రయనుగూడి పెంచఁగా ♦ వలయుఁజుంతు. 18

తే. అనుచు నిలుగ్రుడ్లు వైచి యా ♦ యతివ మిన్న
యసువులఁ దొరంగిపోయిన ♦ యంతనుండి
భద్రకుందారు లిరువుర ♦ బాల్యలఁ గూర్మి
నరయుచుండిరి హర్షల ♦ తాఖ్య నొసఁగి. 19

క. మఱు పెండ్లి యాడఁగోరక
ధరణీపతి తనదు పత్ని ♦ ధర్మగుణములన్
నిరతముఁ దలఁచుచు బాలిక
నరయుచుఁ గాలమ్ము పుచ్చె ♦ నర్హక్రియలన్. 20

క. అన్యోన్యము వరియించిన
ధన్యాత్ముల ప్రేముఁ దెలుపఁ ♦ దరమె యెవరికిన్
మాన్యులు వారె జగమ్మున
వన్యమృగమ్ములకుఁ బోల్ప ♦ వలయు నితరులన్. 21

తే. తనకు మూఁడవ మాసానఁ ♦ దల్లిపోవ
రేయిఁ బవలును బ్రేమతోఁ ♦ బాయకుండఁ
దండ్రియును మేనయత్తయుఁ ♦ దన్నుఁ బెంప
వర్షములు నిండెఁ బంద్రెండు ♦ హర్షలతకు. 22

ఉ. భద్రసమస్తసద్గుణ సు ♦ భద్రయు రూపవిలాససంపదన్
భద్రయు భద్రజీవనసు ♦ భద్రయు జ్యోతిష వైద్య గాన సా
ముద్రిక శిల్పవిద్యల స ♦ ముద్రము నై బరిపూర్ణయౌవనా
బద్రిసమాన ధైర్యము స ♦ మంచితభద్రయుఁ దాల్చి పొల్చుచున్.

క. అనుపమ సద్గుణగరిమన్
దనకుం బతియగుసట కొప్పు ♦ ధర్మవినోదున్
జనవినుత సత్యవాదున్
మనమున వరియించె నంగ ♦ మానవనాథున్. 24

చ. అతఁడు విరోధితండముల ♦ నాహవరంగమునం దెదుర్చుచో
శితతరసాయకం బొకటి ♦ శీర్షమునాటినఁ దత్క్షణంబునన్
నుతులు సెలంగ స్వర్గపురి ♦ నూతనవైభవలక్ష్మిఁ జేకొనన్
ధృతమతి నేగె జీవకళ ♦ దేహము దప్పి ధరిత్రి వ్రాలఁగాన్. 25

ఉ. అంతట భద్ర నాతనికి ♦ నాత్మసమర్పణఁ జేసి వైద్యమున్
సాంతముగాఁ బఠించి తన ♦ యాయువు నెల్లఁ బరోపకారమం
దెంతయుఁ బ్రీతితో నునిచి ♦ యీశ్వరుఁ గొల్చుచునుండె భక్తితో
నింతటి బ్రహ్మచారిణి మ ♦ హిందును లేదనియార్యులెన్నఁగాన్.

తే. మనము నొకరికి నొసఁగిన ♦ వెనుక దానిఁ
గొనక యీశ్వరుఁ గొల్చు న ♦ ద్గుణగరిష్ఠ
లెంతయును ధన్యులవ్వార ♦ లెల్లరకును
నిరుపమాదర్శమూర్తులై ♦ నెగడుచుంద్రు. 27

తే. బ్రహ్మచర్యంబునం దిట్లు ♦ భద్ర దవిలి
హర్షలతకును సుగుణమ్ము ♦ లనుదినమ్ము
విద్యతోఁబాటు కఱపుచు ♦ హృద్యరీతి
నన్నయింట వసించెఁ బ్ర ♦ సన్నమతిని. 28

ఉ. అంతఁ గళింగభూపుఁడు స ♦ మంచితకీర్తికలాపుఁ డానతిన్
గాంతగఁ గైకొనందలఁచి ♦ కామితమున్ మగధావనీరమా
కాంతున కేకతమ్మునఁ బ్ర ♦ కాశముఁ జేసి యథార్థసత్ప్రతిన్
స్వాంతమునం బ్రహృష్టుఁడయి ♦ చయ్యన నేగెను స్వీయభూమికిన్.

శా. మందారుండిట భద్రి రాఁబనిచితా • మన్నించి మ[illegible]
సౌందర్యప్రతిభావిశేషములచే • శౌర్యప్రభావంబుచే
మందారప్రతిమానకీర్తియుతుఁడౌ • మాన్యుండు [illegible]
నందంబొప్పఁగఁ బట్టఁగోరెవినుమా • నామాటఁ బాటింపుమా. 30

తే. సోదరీమణి నేఁ దెల్పు • మేదినీంద్రుఁ
బరిణయంబయి సుస్వయం • వరమునందుఁ
బరమ సౌభాగ్యవతివయి • ప్రజ్వరిల్లి
కులమునకుఁ గీర్తిఁ దెమ్మన్న • పలుకు వినుము. 31

తే. పెద్దకాలంబు నీవిట్లు • పెండ్లిలేక
యున్న దూషించుచుందురీ • యుర్విజనులు
నిందలకుఁ బాలుగాక మ • నింద్యచరిత
కోరి వరియింపు మేఁ దెల్పు • వీరవరుని. 32

తే. పెద్దవాఁడను నామాటఁ • బెడచెవినిడి
యాగ్రహము గల్గఁజేయకు • మమ్మ వినుము
హితులు నాకంటెనెవ్వరైన • నీకుఁగలరె
భద్రనిర్నిద్ర సుగుణప • ముద్రియనిన. 33

తే. భద్రయదివిని మదిభగ • వంతుఁదలఁచి
ధర్మమార్గాను వర్తిని • ధన్యచరిత
గాన నసమానధైర్యంబు • పూనిపలికెఁ
బలుకులను శాంతి వినయమ్ము • లొలుకుచుండ. 34

తే. అన్న నామది వలచిన • యట్టివరుఁడు
నాదుజీవనయాత్రకు • నవ్యమైన
దీపముగఁదనసుగుణక • లాపమొసఁగి
స్వర్గమున వెల్గుచున్నాఁడు • భానుపగిది. 35

తే. కానసే బ్రహ్మచర్యంబు ♦ పూనివిమల
కార్యములచేత లోకోప ♦ కారములను
జలుపుచుండుదు భగవంతు ♦ స్వాంతమందు
నిలిపినిరతంబు నిదినాదు ♦ నిర్ణయంబు. 36

తే. అనినఁ జూఱచుఱఁజూచుచు ♦ నవనివిభుఁడు
కోపవేగమ్మచే శాంతిఁ ♦ గోలుపోయి
మద్యపానంబు సేసిన ♦ మత్తువోలె
నూటతడఁబడ నిట్లని ♦ మాఱుపలికె. 37

తే. క్రొత్త యాచారములఁ బురి ♦ కొల్పియిట్లు
కులముఁ జెఱచుచునాకు వ్యా ♦ కులమొసంగు
పనులుసేయక యొకమంచి ♦ వరునిఁగాంచి
యిహపరమ్ముల గడియింపు ♦ మింకనైన. 38

తే. అనుచుఁ గటకటఁబడిరొమ్ము ♦ నన్నఁజూచి
మది విషాదాగ్నిలోఁబడి ♦ మండుచుండఁ
గంటఁ దడివెట్టియగ్రజు ♦ కాళ్లవ్రాలి
మెల్లఁగాలేచి యిట్లను ♦ మెలఁతమిన్న. 39

తే. గార్గి మొదలగువార లీ ♦ ఖండమందు
బ్రహ్మచర్యంబుచేఁ గీర్తిఁ ♦ బడయలేదె
క్రొత్తయే యిదిమనయార్య ♦ కులమునందుఁ
బూత చారిత్రలను గన్న ♦ భూమియందు. 40

తే. ఏక పత్నీవ్రతంబెట్టు ♦ లీ వొనర్తు
వట్టులేక పతివ్రతం ♦ బాచరింతు
ధర్మమందఱ కొకట్లైె ♦ తనరుఁగాక
వేరువేరుగనుండునే ♦ విమలచరిత. 41

తే. అనుచుఁ దురపిల్లు చెలియలి ♦ కనులు దుడిచి
చిత్త మొకయింత జాలిచే ♦ మెత్తపడిన
మెల్లఁగా నిట్టు లనియెను ♦ మేదినీశుఁ
డమ్మ కూర్చుండు మనుచుఁ బీ ♦ ఠమ్ముఁ జూపి. 42

తే. ఎవఁడు నీభర్త నీపెండ్లి ♦ యెపుడుజరగె
నందఱును జూడ నేఁ ♦ బెండ్లి ♦ యాడినట్లు
నీవు నాడితివే చెప్పు ♦ నిర్మలాత్మ
యన్న నన్నకు నిట్లనె ♦ నతివ మిన్న. 43

తే. అంగనాథుని వలచితి ♦ నంత నతఁడు
గాంచె స్వర్గంబు యుద్ధరం ♦ గంబునందు
నతని వరియించినప్పుడే ♦ యంతరాత్మ
పెండ్లిచేసెను వేరిఁకఁ ♦ బెండ్లి యేల. 44

ఆ. సర్వసాక్షి యెదుటఁ ♦ జలిపినదది మేలొ
ధరణిజనుల యెదుటి ♦ తంతు మేలొ
నీవె చెప్పుమన్న ♦ నిర్ణయ మొనరించి
హస్తకంకణమున ♦ కద్దమేల. 45

తే. అనుడు భూపతిచెల్లెలి ♦ నట్లె చూచి
యంగనాథుఁడు నినుఁ బెండ్లి ♦ యాడినాఁడె
యెచటఁ జూచినఁ బెండ్లికి ♦ నిరువురుందు
రొక్కరికె పెండ్లి జరగునే ♦ యొక్కఁడైన. 46

తే. అనిన భద్ర యులుంగత్తి ♦ యన్నకనియె
నతఁడు వరియించెనో లేదో ♦ యతని కెఱుక
నే వరించిన దెంతయు ♦ నిక్కువంబు
తెలియు మిఁక నాప్రతిజ్ఞను ♦ దీర్చి విడుతు. 47

మ. అనినన్ గోపముచేత మండిపడుచున్ ♦ హా దుష్ట నీకిచ్చటన్
జనవేనిచ్చుట నింత చేటుగలిగెన్ ♦ నన్న్యాసమున్ దాల్తువే
నినుఁ జండాగ్నినిఁ గాల్చివైచి దెసలన్ ♦ నీభస్మమున్ జల్లెదన్
జను నాముందట నిల్వఁబోకుము నిమే ♦ షంబున్ గులోన్మూలినీ. 48

చ. అనుచుఁ గఠోరభాషణము ♦ లాడెడు నన్నకు నేవగించి త
త్క్షణమున లోనికిం జని వి ♦ చారమునం బడి భద్రి యుండఁగా
దినకరుఁ డోర్వలేక తన ♦ తేజము మాసి విషణ్ణమూర్తియై
చనియె ననంగఁ దామునిఁగె ♦ సర్వము చీఁకటిలో మునుంగఁగాన్.

ఉ. అప్పుడు భద్రి యొంటరిగ ♦ నప్పరమేశునిఁగూర్చి యీశ్వరా!
దెప్పరమైన కష్టమున ♦ దేవ మునింగితి నీవె తెప్పవై
తప్పక నన్నుఁ గావవలెఁ ♦ దప్పిన నెవ్వరు గాచువారు నా
కెప్పుడు నీవె యూఁతవని ♦ యెంచితి నీశరణంబుఁ జొచ్చితిన్.

క. రారాజు నాసహోదరుఁ
డేరాజును జేరఁబోడు ♦ నీశ్వర నిన్నే
రారాజుగఁ దలఁచుచు నన్
ధారాళంబైన మదిని ♦ దయ నెవఁ డేలున్. 51

తే. అనుచు భగవంతుఁ బ్రార్థింప ♦ నాత్మలోన
మాళవేంద్రుండు భక్తుండు ♦ మహితయశుఁడు
శరణమియ్య సమర్థుండు ♦ శాంతమూర్తి
యతనిఁ జేరినఁ గడు భద్ర ♦ మనుచుఁ దోఁచె. 52

తే. అంతఁ దాఁ బెంచుచుండిన ♦ హర్షలతను
నిద్రవోయెడుదానిని ♦ నిండుప్రేమ
మోము మోమునఁ జేరిచి ♦ ముద్దువెట్టి
చేత శిరమును దాఁకి యా ♦ శీర్వదించి. 53

తే. వదలిపోఁజాల కెంతయు ♦ వందురల్లి
యెట్టకేలకు మనసును ♦ గట్టిచేసి
వెడలిపోయెను నపురేయి ♦ వెలఁదిమిన్న
మాళవపుదారిఁబట్టి ప్రే ♦ మంబు నెట్టి. 54

ఉ. అక్కడ ధర్మపాలుఁడు స ♦ మంచితశీలుఁడు మాళ్వమేలువాఁ
డోక్క పరిభాతవేళఁదన ♦ యుండును బత్నియు నాప్తమిత్రులున్
దక్కిన వారలుం గలసి ♦ దైవము నెంతయు భక్తిఁ గొల్వఁగా
నక్కడి కేసుదెంచెను స ♦ మాహితచిత్తముతోడ భద్రయున్. 55

తే. వచ్చి కూర్చుండి వీణెను ♦ బాణిఁ దాల్చి
శ్రుతినిగూరిచి మంగళ ♦ శ్రుతి చెలంగ
రాగ మాలాపనముసేసి ♦ రమ్యఫణితి
నీశ్వరుని భక్తి వినుతించె ♦ నిట్లు భద్ర. 56

గండకము.

శ్రీమన్మహామంగళాకార భక్తానుసారా కృపాపూర యోగీంద్రచిత్తాబ్జసంచార సర్వార్థసారా సమస్తప్రభాధార బ్రహ్మాండనిర్మాణధీరా సుధర్మప్రచారా ప్రపన్నార్తిహారా నినున్ గొల్చు సర్వంబు నిన్ జూపు విశ్వంబు నీ చిత్రచాతుర్యమున్ దెల్పు నీ వాడు బంతుల్వలెన్ బొల్చు లోకంబు లెల్లన్ మహాసూత్రధారుండవై పూని యాడించు నీబొమ్మలంబోలి మే మిట్లు క్రీడించుచున్నాము నిన్నిట్టివానిన్ దగన్ బట్టి చిత్తంబులోఁ గట్టిపెట్టంగ భక్తిన్ బ్రసాదింపవే దేవదేవా మహాపాప దావాగ్ని సందగ్ధులైనట్టి మమ్ముద్ధరింపన్ దయాసారమున్ వేగ వర్షింపవే హర్షముం జెంపవే సార్వభౌమా మహానందధామా సదాభక్తహృద్వ్యోమ సంపూర్ణసోమా నమస్తే నమస్తే నమస్తే నమః. 57

చ. అనుపమభక్తి సంభరిత • మైనసుధామయ సూక్తి మివ్విధిన్
వినిచిన భవ్యనందనుఁడు • వేయివిధంబుల మెచ్చుచుండ నా
జనపతి ధర్మపాలుఁడు ప్ర • సన్నపుఁజూపుల నామెఁజూచి యో
జనని మదీయసుందరను • సర్వము పావనమయ్యె నీకృపన్. 58

ఉ. ఎందఱిదానవమ్మ యిట • నేమికతమ్మున వచ్చితమ్మ నా
ముందట సంశయింబుడిగి • పూర్ణముగా నెఱిఁగింపవమ్మనీ
విందు నుతించినట్టిపర • మేశుఁడెనిన్గొనివచ్చెనమ్మమా
యందఱమానసంబులన • మంచితభక్తిని నించితమ్మరో. 59

తే. అనినఁదలవంచి చూపుల • నవనివాల్చి
మృదులగంభీరరవముల • మెలఁతవలికె
సుగధనాజన్మభూమి నా • మంబుభద్ర
ప్రభువతంసమ మద్భర్త • రాజరాజు. 60

మ. అనినన్ దిగ్గన లేచి యిచ్చెరువులో • నాచేఁడు దానిట్లనెన్
జననీ! యుత్తమపీఠముఁగొనుము నా • చాలోపముల్గల్గియుం
డినఁ జన్నింపుము నీదుసోదరునికం • టెన్ ప్రేమతోఁ జూచిధ
న్యునిఁగావింపుము సేవలందుమునునే • యోగ్యంబుగాఁదోఁచినన్.

క. జననీనీవిఖ్యాతిని
వినియుంటిని వీనులకును • విందుగఁగొంతన్
గనులున్నందులఫలముగఁ
గనుఁగొంటిని నిన్నునేఁడు • కారుణ్యనిధీ. 62

చ. అనుటయుఁగన్నులం దొరఁగు • నశ్రులఁజెప్పలనప్పళించుచున్
దనవదనంబునెత్తి నర • నాథుఁగనుంగొని భద్రయిట్లనెన్
జననుతకీర్తి నాచరిత • సాంతముగా విని యంతమీఁదనీ
మనమునఁ దోఁచినట్లుగన • మంజసరీతినిఁ జేయఁగాఁదగున్. 63

క. అనుటయు మాళ్వమహీపతి
జననీ! మనసారవినెద ♦ జంకక చెపుమా
యనభద్రిమొదలు తుదిగాఁ
దనవృత్తాంతంబు నివ్వి ♦ ధంబునఁదెలిపెన్. 64

తే. సుగుణమణి గణమూర్తియై ♦ నెగడువాని
నంగనాథుని వలచితి ♦ నంతనతఁడు
కదనతలమున స్వర్గంబుఁ ♦ గాంచెఁగాన
మనసులో నన్యవరియించు ♦ మాటలేక. 65

తే. బ్రహ్మచర్యంబులోపలఁ ♦ బరఁగుచున్నఁ
బరునివరియింపు మనిచాల ♦ బాధపెట్టి
పరుషవాక్యమ్ములను బల్కె ♦ భ్రాత్రితగానఁ
దరలివచ్చితినీ లీల ♦ ధర్మపాల. 66

చ. శరణముఁ గోరివచ్చితిని ♦ శస్త్రచికిత్సయు నౌషధక్రియల్
గలచితిఁ గొంతగాన సుప ♦ కారమునివ్విధి దీనపాళికిన్
గరమనురక్తిఁ జేయుచును ♦ గాలముపుచ్చఁగనుండుదాననీ
కరుణకుఁ బాత్రినై తెలుపు ♦ కాంచిమనంబున మేలుకీడులన్. 67

తే. అనుచు భద్రయెఱింగింప ♦ నాలకించి
భావమునఁ దూఁచిసాధక ♦ బాధకముల
ధర్మపాలుఁడు నిజముగా ♦ ధర్మపాలుఁ
డగుట నామెకునిట్లని ♦ యభయమిచ్చె. 68

ఉ. ధర్మపథంబు నన్నడచు ♦ ధన్యవుమాళ్వమెల్ల ధన్యమౌ
నిర్మలవృత్తముద్దవిలి ♦ నెమ్మదినుండుము వైద్యశాస్త్రస
న్మర్మములెల్లఁ దెల్పుచును ♦ దారతనిచ్చట వైద్యులందునీ
ధార్మికభావముం గొలిపి ♦ దైవమునిచ్చలు భక్తిఁగొల్చుచున్. 69

చ. అని తనపత్నియాసరళ • నంతఁగనుంగొని యోసతీమణీ
యనుపమ గౌరవాస్పదమ • హోగుణభూషణ యీమెగాననీ
వనుదినముఁ సపర్యలస • మాహితరీతినిఁ దన్పుచుండుమా
ఘనసుకృత ప్రభావమునఁ • గాక మహాత్ముల సేవకల్గునే. 70

తే. అనుచు శరణంబొసంగిన • యాత్మనలరి
ధర్మనిష్ఠాగరిష్ఠత • ధర్మపాలు
సొద్దఁగాలంబుపుచ్చుచు • నుండెభద్ర
సరళ పరమాప్తురాలయి • పరఁగుచుండ. 71

మాలిని.

శ్రితజనపరిపాలా • చిన్నమాంబానుకూలా
చతురవచనలోలా • సాధుసమ్మాన్యశీలా
వితరణ శిబిలీలా • వీతదుర్వైరి మూలా
అతులసుగుణజాలా • ఆత్మ తేజో విశాలా. 72

గద్య.

ఇది శ్రీపరమేశ్వర కరుణాఫలిత లలితకవితాకలిత శ్రీరామలక్ష్మాం
బా బుచ్చివేంకయామాత్యతనూజాత సకలసజ్జన విధేయ ఆది
పూడి సోమనాథ నామధేయ ప్రణీతంబయిన శ్రీ విజ
యేంద్ర విజయంబను సుప్రబంధంబు నందుఁ
బ్రథమాశ్వాసము.





శ్రీ

# విజయేంద్రవిజయము.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీకరగుణరత్నాకర
నాకగురుప్రోక్తసార • నయసంచారా
ప్రాకటధర్మ విహారా
శోకనివారణవిచార • సూర్యనృపవరా. 1

క. ఆలింపుము మగధధరా
పాలుండటు భద్రి ధర్మ • పాలునిపాలన్
గాలముపుచ్చుట వినితాఁ
దాలిమివిడనాడి మదినిఁ • దల్లడపడుచున్. 2

సీ. ఏలనాయెలనాఁగ • యీహర్షలతవీడి
వంతలోననుముంచి • నైచిచనియె
నేలనాసోదరి • యెలమితోవలచిన
యంగనాథుఁడు యుద్ధ • మందుమడిసె
నేలకళింగేశుఁ • డేతెంచి భద్రిమ
దనకుఁగాంతగనియ్య • మనుమవేఁడె
నేలనేఁజెప్పిన • హితములౌపలుకులు
చెలియలిచెవులకు • ములుకులయ్యె

నేలతోఁబుట్టు తాలిమిఁ ♦ దాలిధర్మ
పాలుపాలను జేరి నా ♦ పరువుఁజెఱిచె
నేలద్రోసితివిటు దుఃఖ ♦ జాలమందు
నీవిలాసమ్ములీశ్వరా! ♦ నీకెఱుక. 3

తే. అనుచుఁజింతిల్లి పలుమాఱు ♦ నత్తకొఱకు
నాఁపుకోనలేక యేడుచు ♦ హర్షలతను
జేరియోదార్చితనవిధి ♦ దూఱిదూఱి
మాళవుని సాహసంబును ♦ మదిఁదలంచి. 4

తే. ఔర! నన్నొక్క మాటైన ♦ నడుగకుండఁ
జక్రవర్తికి నాకింత ♦ జంకకుండ
గర్వరోగంబుచేఁ గన్ను ♦ గానకుండ
భద్రఁ దాఁజేరనిచ్చెను ♦ బంపకుండ. 5

తే. అనుచుఁగోప భరమ్మును ♦ నాఁపలేక
ధర్మపాలుని సుగుణాళిఁ ♦ దలఁపలేక
మనములోపలఁ గరుణయన్ ♦ మాటలేక
లేఖమాళవపతికి నీ ♦ లీలవ్రాసె. 6

ఉ. మైత్రికి భంగమౌనటులు ♦ మమ్ము నెదిర్చినయట్టి సోదరిన్
బాత్రగ నెంచి యిట్లభయ ♦ భారము వూనుట భావ్యమౌనె మా
మిత్రుని వెంటఁ దత్క్షణమ ♦ మీరిపుడైనను భద్ర నంపి మా
మైత్రికిఁ బాత్రులై మనుఁడు ♦ మానినఁ దత్ఫలమేమి సెప్పనా. 7

క. అను నీలేఖను గొనిచనఁ
బనిచెను రణధీరు నటకు ♦ భవ్యవిచారున్
వినయాది సుగుణహారున్
జనవినుతోదారుఁ బరమ ♦ శాంతివిహారున్. 8

శా. ఆలేఖుం గొని యాతఁడేగి కనియెన్ ♦ హర్మ్యాళి సర్వేశునిన్
లీలన్ నూతనగీతజాతముల నో ♦ లిన్ గోమలుల్పాడనే
వేళన్ వీనుల విందుగా విని జనుల్ ♦ విద్యావినోదమ్ములన్
గేళిన్ సల్పెడు మాళవేంద్రు నగరిన్ ♦ గీర్వాణనాట్యస్థలిన్. 9

క. అతులమహోద్యానము గతి
నతిముద మొదవించునట్టి ♦ యప్పురవరమున్
మితపరివారముఁ దోఁగొని
ధృతియుతుఁడై చొచ్చి జనులు ♦ దేరి కనుఁగొనన్. 10

క. అటు నిటు వీక్షించుచు న
కౄటికముతో బీదలకును ♦ గడు దీనులకున్
దటుకున రూకలఁ జల్లుచుఁ
జటులగతిన్ బోయి పోయి ♦ సంరంభముతోన్. 11

తే. తమ్మిమధ్యమ్మునను గ్రాలు ♦ దిమ్మెనోలెఁ
బురము నడుమను సొగసుగాఁ ♦ బొల్చు నగరు
లోనికిని జని భూపాలు ♦ నానతిఁ గొని
యోలగముఁ జొచ్చి రణధీరుఁ ♦ డుచితరీతి. 12

తే. చేతులను మోడ్చి జనపాలు ♦ సేమ మరసి
కమ్మఁ జదువంగనిచ్చి య ♦ కౄడను దనకు
గూర్చియున్నట్టి పీఠానఁ ♦ గూరుచుండి
యేమి సెలవని యడుగను ♦ ర్వేశుఁ డనియె. 13

తే. ధర్మమార్గంబు దప్పని ♦ ధన్యచరిత
ప్రబలుఁడైనట్టి యన్నకు ♦ భయముఁజెంది
శరణువేఁడిననీకుంట ♦ క్షత్త్రియునకు
న్యాయమే తెల్పు రణధీర ♦ నయవిహార. 14



నేలతోఁబుట్టు తాలిమిఁ ♦ దూలిధర్మ
పాలుపాలను జేరి నా ♦ పరువుఁజెఱిచె
నేలద్రోసితివిటు దుఃఖ ♦ జాలమందు
నీవిలాసమ్ములీశ్వరా! ♦ నీకెఱుక. 3

తే. అనుచుఁ జింతిల్లి పలుమాఱు ♦ నత్తకోఱకు
నాఁపుకొనలేక యేడుచు ♦ హర్షలతను
జేరియోదార్చితనవిధి ♦ దూఱిదూఱి
మాళవుని సాహసంబును ♦ మదిఁదలంచి. 4

తే. ఔర! నన్నొక్కమాటయు ♦ నడుగకుండఁ
జక్రివర్తికి నాకింత ♦ జంకకుండ
గర్వరోగంబుచేఁ గన్ను ♦ గానకుండ
భద్రఁ దాఁజేరనిచ్చెను ♦ బంపకుండ. 5

తే. అనుచుఁగోప భరమ్మును ♦ నాఁపలేక
ధర్మపాలుని సుగుణాళిఁ ♦ దలఁపలేక
మనములోపలఁ గరుణయున్ ♦ మాటలేక
లేఖమాళవపతికి నీ ♦ లీలవ్రాసె. 6

ఉ. మైత్రికి భంగహానటులు ♦ మన్ను నెదిర్చినయట్టి సోదరిన్
పాత్రగ నెంచి యిట్లభయ ♦ భారము పూనుట భావ్యమానె మా
మిత్రుని వెంటఁ దక్షణమ ♦ మీరిపుడైనను భద్ర నంపి మా
మైత్రికిఁ బాత్రులై మనుఁడు ♦ మానినఁ దత్సల మేమి సెప్పనా. 7

క. అను నీలేఖను గొనిచనఁ
బనిచెను రణధీరు నటకు ♦ భవ్యవిచారున్
వినయాది సుగుణహారున్
జనవినుతోదారుఁ బరమ ♦ శాంతివిహారున్. 8

శా. ఆలేఖం గొని యాతఁ డేగి కనియెన్ ♦ హర్మ్యాళి సర్వేశునిన్
లీలన్ నూతనగీతజాతముల నో ♦ లిన్ గోమలుల్పాడనే
వేళన్ వీనుల విందుగా విని జనుల్ ♦ విద్యావినోదమ్ములన్
గేళిన్ సల్పెడు మాళవేంద్రు నగరిన్ ♦ గీర్వాణనాట్యస్థలిన్. 9

క. అతులమహోద్యానము గతి
నతిముద మొదవించునట్టి ♦ యప్పురవరమున్
మితపరివారముఁ దోఁగొని
ధృతియుతుఁడై చొచ్చె జనులు ♦ దేరి కనుఁగొనన్. 10

క. అటు నిటు వీక్షించుచు న
క్రూటికముతో బీదలకును ♦ గడు దీనులకున్
దటుకున రూకలఁ జల్లుచుఁ
జటులగతిన్ బోయి పోయి ♦ సంరంభముతోన్. 11

తే. తమ్మిమధ్యమ్మునను గ్రాలు ♦ దిమ్మెవోలెఁ
బురము నడుమను సొగసుగాఁ ♦ బొల్చు నగరు
లోనికిని జని భూపాలు ♦ నానతిఁ గొని
యోలగముఁ జొచ్చి రణధీరుఁ ♦ డుచితరీతి. 12

తే. చేతులను మోడ్చి జనపాలు ♦ సేమ మరసి
కమ్మఁ జదువంగనిచ్చి య ♦ క్రూడను దనకున్
గూర్చియున్నట్టి పీఠానఁ ♦ గూరుచుండి
యేమి సెలవని యడుగను ♦ ర్వీశుఁ డనియె. 13

తే. ధర్మమార్గంబు దప్పని ♦ ధన్యచరిత
ప్రబలుఁడైనట్టి యన్నకు ♦ భయముఁ జెంది
శరణు వేఁడిననీకంట ♦ క్షత్రియునకు
న్యాయమే తెల్పు రణధీర ♦ నయవిహార. 14

ఆ. ధర్మపథమునందుఁ ♦ దనరుచుండెడివారు
దైవమునకుఁగూడఁ ♦ దలఁకఁబోరు
ధర్మపథముఁదప్పి ♦ తరలుచుండెడివారు
చీమమైనభయము ♦ చెందుచుంద్రు. 15

చ. అనరణ ధీరుఁడిట్లనియె ♦ నార్యపథైక విహారులీరలున్
వినమితవైరి వీరుఁడగు ♦ వీరవరేణ్యుఁడు సార్వభౌముఁడున్
మనమున నీసులన్నిటిని ♦ మానిపరస్పర మైత్రివర్తిలన్
జనులకుమాకు నందఱకు ♦ సౌఖ్యముగా కిదియేటివైరముల్. 16

చ. దివిభువి దద్దిరందిరుగు ♦ తీరునధాటిని వైరికోటులన్
గవిసిమహోట్ట హాసమునఁ ♦ గాలకృశాను కరాళమూర్తియై
బవరమునందు నోరిచిన ♦ భవ్యపరాక్రమ శాలిముందటన్
దవిలియెవండునిల్చునువృ ♦ థాకదుసాహసమేల భూధవా. 17

ఉ. భద్రకు భాత్రభానమును ♦ బట్టిమెలంగఁగ బుద్ధిసెప్పిసా
భద్రపరాక్రముండు నృప ♦ భద్రుఁడు మెచ్చెడునట్లువెంటనే
భద్రనుబంపి మీకుఁగల ♦ భవ్యతరంబగుభక్తిఁ జూపినన్
భద్రముగాక నీతిఁగఱ ♦ పంగసమర్థులమే ధరాధిపా. 18

తే. అనిన రణధీరుఁగూర్చియి ♦ ట్లనియెనృపుఁడు
న్యాయయుతమైన శౌర్యంబు ♦ నరపతులకు
భూరితరమైన శాశ్వత ♦ భూషణంబు
ఘోరకలుషంబు కేవల ♦ పౌరుషంబు. 19

చ. సుగుణసముద్రమై వెలయు ♦ శుద్ధచరిత్రకు బుద్ధినేర్పనే
తగనిపథంబునన్నడచు ♦ దర్పనిమగ్నుని భక్తిఁగొల్వనే
యగునగునిట్లు పలుకఁటిది ♦ యర్హమెతుచ్ఛపు సార్వభౌములా
జగములనెల్లనేలెడు ప్ర ♦ చండప్రశాసనుకంటెఁ బూజ్యులే. 20

ఉ. సూర్యుఁడు చూర్ణమై పడినఁ ♦ జుక్కలు జల్లున నేల రాలినన్
ధైర్యము వీడి భద్రునియ ♦ థార్థము వీడను సార్వభౌముఁడున్
గ్రార్యము మాని చెల్లెలినిఁ ♦ కన్ గరుణాయత దృష్టిఁ జూతు నం
చార్యుల ముందటన్ బలుక ♦ హర్షము మీఱఁగ నప్పుడంపెదన్. 21

ఉ. ఎన్నఁగరాని లోకముల ♦ నెవ్వఁడు దాల్చి వెలుంగుచుండునో
యన్ని చరాచరంబులకు ♦ నాదరువై యెవఁడర్థిఁ బ్రోచునో
సన్నుతశౌర్య మవ్వఁడిల ♦ సజ్జనచిత్తములందుఁ గూర్చునో
నన్నతఁడెంతయున్ గరుణ ♦ న్యాయపథంబున నుంచి కాచుతన్.

క. భద్రునిచ్చట నెట్టియు
పద్రవమును లేదు భక్తి ♦ భావములోడన్
భద్రుఁడుగాఁ గాపాడెద
భద్రయశా! తెలుపుము సార్వ ♦ భౌముని యెదుటన్. 23

తే. అనిన రణధీరుఁ డాతని ♦ యనుల మతికి
నెంతయును మనములోపల ♦ సంతసించి
పరమగాంభీర్య హృదయుఁడై ♦ పరఁగు కతన
భావమును గప్పిపుచ్చుచుఁ ♦ బలికె నిట్లు. 24

తే. మీదు సేమంబు నే కోరి ♦ మితము మీఱి
చెప్పవలసినదంతయుఁ ♦ జెప్పినాఁడ
ముందు జరగెడు దానికి ♦ మందు లేదు
పోయి వచ్చెద సెలవిమ్ము ♦ భూమిపాల. 25

చ. అనిరణధీరుఁ డావిభుని ♦ యానతిఁ గైకొని బల్ హుటాహుటిన్
జనిమగధావనీంద్రుఁ గని ♦ సామము దానము భేదమేమియున్
జనవని ధర్మపాలుని వి ♦ చారము నంతను దెల్పమానటుల్
వినిచిన సార్వభౌముఁడు వి ♦ వేకము వీడి మహాగ్రహోగ్రుఁడై. 26

చ. ననునిర్వక్ర పరాక్రమక్రమచణు • న్రాజన్యకోటీర నూ
తనరత్నాంశు విరాజమానపదప • ద్మద్వంద్వుఁడా రేఁపెగా
కనదుగ్రాసిని నీచుకంఠతలమున్ • ఖండించి మచ్ఛౌర్యసం
జనితానందమునందుఁ దేలినఁగదా • జన్మంబుసాఫల్యమౌ. 27

తే. అనుచు నాడునుగఱచి బా • హాప్ఫళించి
మీసమును ద్రిప్పి కత్తిని • దూసిపట్టి
మిత్రుఁ డైనట్టి రణధీరు • మీఁద దృష్టిఁ
బఱపి యిట్లానతి యొసంగెఁ • బ్రభువరుండు. 28

చ. కలనికి సేనలంగొలుపు • కర్ణకఠోర ధణంధణార్భటిన్
విలయము మాళవంబుగను • వీఁకను వీరుల నెచ్చరించు భూ
వలయము కంపమొందుగతి • నాగణవాజిరథాళి ధాటితోఁ
గలసి చమూపతుల్ నడవఁ • గానియమింపుము పొమ్ముచెచ్చెరన్

క. అని రణసన్నాహమ్ముల
రణధీరుని నునిచి తాను • రాత్రిందివముల్
దనకా మాళవపాలుం
డొనరించిన దాని నెంచి • యుడుకుచు నుండెన్. 30

ఉ. అక్కడ ధర్మపాలుఁ డిఁక • నాహవమెవ్విధిఁ దప్పదంచుఁ బెం
పెక్కిన వీరులం గలసి • యేత్తెఱఁ జూపఁగ వేచియుండి తా
నొక్క ప్రభాతమందు సమ • యోచితకార్యముఁ దీర్చి చేరె బల్
చక్కని చిత్రసంపదల • సంగతిఁ జెల్వగు రాణివాసమున్. 31

క. అంతన్ సరళారాక్షియు
నెంతయు సంతసముతోడ • నెదురేగి ధరా
కాంతునిఁ గొనివచ్చితమిన్
దంతపుపని పీఠమందుఁ • దగ మన్నించెన్. 32

తే. ఇట్లు సత్కార మొనరించి ♦ యెలమినించి
చెంతఁ గూర్చుండి వీవనఁ ♦ జేతఁబట్టి
మెల్లఁగా వీచుచుండెడి ♦ మెలఁతఁ జూచి
పలికె వల్లభుఁ డీలీల ♦ భవ్యసరణి. 33

క. కాంతాయుద్ధము గల్గుట
యెంతయు సత్యంబు విను జ ♦ యేందిర యెవనిన్
గాంతునిగా వరియించునొ
యింతీ! తెలుపంగఁదరమె ♦ యెవ్వరికేనిన్. 34

తే. న్యాయ మన్యాయమునకుఁ దా ♦ నణఁగినట్లు
కనఁబడినఁ జిట్టచివరకుఁ ♦ గాంచు జయముఁ
గాన నపజయ మొందినఁ ♦ గలఁగ రెపుడు
ధర్మమార్గానువర్తులౌ ♦ ధరణిధవులు. 35

తే. ధర్మపథమునవర్తింపఁ ♦ దలఁచువారు
దైన్యమును మాని ధైర్యమ్ము ♦ దాల్పవలయుఁ
బరమపురుషార్థమును జూపి ♦ ప్రబలవలయు
నీశ్వరునిమీఁద భారంబు ♦ నిడఁగవలయు. 36

తే. కొంచెమైనను నాసేన ♦ యించుకైన
భయము నొందక సమరసం ♦ భ్రమముతోడ
నడరుచున్నది రిపుబల ♦ మడలునట్లు
పూతమౌ న్యాయపక్షంబుఁ ♦ బూనుకతన. 37

తే. సమరలంపటులై క్రాలు ♦ శౌర్యనిధులు
దండనాథులు గొల్వఁగాఁ ♦ దనరుచుండు
ప్రబలచతురంగసేనావి ♦ భాసితుండు
సార్వభౌముండు చండప్ర ♦ శాసనుండు. 38

చ. బవరమునందు నోటువడు ♦ పాటొకవేళ ఘటిల్లెనేని నీ
ధవుఁ డొనరించినట్టి శప ♦ థంబును దీర్పఁగడంగు మానినీ
వివిధజగంబులన్నృపను ♦ వేడుక నేలెడువాఁడు తోడగున్
ప్రవిమలకీర్తిసంపదకుఁ ♦ బట్టముగట్టును నిన్నుఁ బావనీ. 39

క. అనినన్ భయసంభ్రమములు
పెనఁగొనఁ జిత్తమున సరళ ♦ పేర్చినభక్తిన్
జనపతి వదనాంబుజమును
గనుఁగొని యిట్లనియెఁ దన్నుఁ ♦ గాంతుఁడు మెచ్చన్. 40

చ. వికలుఁడు సార్వభౌముఁడు వి ♦ వేకమునొంది మెలంగునట్లుగా
నకలుష రైన భద్రకు స ♦ మంచితశాంతి పొసంగునట్లుగా
సుకముగ మీరునుం బ్రజలు ♦ శోభిల నేఁగని పొంగునట్లుగ
న్ప్రకటజయంబు మీకుఁ గరు ♦ ణానిధి వేగ నను గ్రహించుతన్. 41

తే. అనుచు దీవెనపలుకులు ♦ నమితభక్తి
సరళ పలుకుచునుండెడు ♦ సమయమందె
దూరమున నుఱిమినట్టులు ♦ తుములమొకటి
ధర్మపాలుని కర్ణరం ♦ ధ్రములు సోఁకె. 42

తే. అప్పుడే చారులరుదెంచి ♦ యవలనిలిచి
చటులతరధాటితోవచ్చు ♦ సార్వభౌము
ప్రథమసైన్యమ్ము లనతి దూ ♦ రమ్మునందు
వచ్చి విడియంగఁ జొచ్చెను ♦ విచ్చలవిడి. 43

తే. అనుచు వినిపింప సతిని న ♦ క్కునను జేర్చి
ముద్దుఁగొని సాదరమ్మున ♦ మోముఁజూచి
భద్ర భద్రము మనకుల ♦ భద్రుఁ డగుచు
వెలయు విజయేంద్రు నరయుము ♦ వేయికనుల. 44

క. అని రణసన్నాహుం డై
తనసతి యిడినట్టి సేసఁ ♦ దాల్చి శిరమునన్
మనమున నీశ్వరుఁ దలఁచుచుఁ
జని యంతిపురమ్ము దాఁటి ♦ జననాథుఁ డటన్. 45

క. భూషణభూషిత యగుచున్
హేషారవ మొసఁగ ఖురము ♦ నిలఁ గొట్టుచు సం
తోషమునఁ జెలఁగు హయము ని
మేషంబున నెక్కి పోలిచె ♦ మించిదనేంద్రుఁడున్. 46

చ. ఇటులు హయాధిరూఢుఁడయి ♦ యొన్నిక కెక్కిన యచ్చమూపతుల్
పటుతరభక్తిఁ గొల్వఁ బరి ♦ పంథిబలక్షయసూచకంబుగాఁ
బటుహుడుక్కకాహళర ♦ వమ్ములు భద్రములై చెలంగఁగాఁ
జటులతరోగ్రధాటిఁ జనె ♦ సంగరకేళికి సార్వభౌముఁ డై. 47

ఉ. అక్కడ సార్వభౌముఁడు మ ♦ హాహవదోహలుఁ డెంతయుం దమిన్
జక్కని రాతురాయి గల ♦ చారుకిరీటము దాల్చి మేనిపై
నుక్కునఁ జేసినట్టి కవ ♦ చోత్తము మొక్కటి గూర్చి దుస్తులన్
దక్కిన భూషలన్ దొడిగి ♦ దర్పము మీఱ గజాధిరూఢుఁ డై. 48

సీ. నిస్సాణధణధణ ♦ నినదంబులను మిత్తి
సటుహుంభాంకారముల్ ♦ పన్నుమండ
గజబృంహితమ్ములఁ ♦ గడలకుఁ దట్టుచు
హేషారవమ్ములు ♦ హెచ్చి చెలఁగ
భటసింహనాదముల్ ♦ పాటింపకను వంది
జయనిస్వనంబులు ♦ చదలు ముట్ట
దండనాథులమించి ♦ దళములు ప్రాంగుచుఁ
బ్రవిమలతరమైన ♦ భక్తిఁ గొల్వ

నాఁడు ధర్మజుసేనపై ♦ నడచినట్టి
రాజరాజచమూధాటి ♦ అవ్వసేయు
రాజసమ్మున వెడలెసీ ♦ రాజరాజు
ధర్మపాలునిమీఁది ♦ కుద్దండవృత్తి. 49

క. ఇరువుర ప్రధమబలమ్ములు
సరిసరిగాఁ బోరఁదొడఁగె ♦ సమ్రాట్టువెసన్
బురికొల్పఁ గ్రొత్తపౌజుల
దురము భరంబగుచువచ్చె ♦ దోహాళమెచ్చన్. 50

క. నూతనసేనలమాళవ
భూతలనాథుండు పంచి ♦ పోరుభరించెన్
ఖ్యాతికి నిదసరికాదని
చాతుర్యముమీఱ రాజ ♦ శార్దూలుండున్. 51

చ. ప్రబల చమూపరంపరల ♦ భండనభూమికిఁ గొల్పివానికిన్
సుబలుని దండనాథునివి ♦ శుద్ధపరాక్రముఁ జేసెనేతగాన్
సబలుఁడువాఁడు మాళవపు ♦ సైన్యముపైఁబడి నుగ్గునూచగా
దబదబఁగూల్పఁజొచ్చినను ♦ దంబున నార్చిరి పేర్చిమాగధుల్. 52

చ. అదిగని ధర్మపాలుఁడును ♦ హాగ్రహమున్ వహియించియుగ్రుఁడై
పదనగువాలుదాల్చి పరి ♦ పంధిబలంబులఁ గూల్చియాఖలున్
గదిసికరాళ ఖడ్గమునఁ ♦ గంఠము వేతెగఁ ద్రుంచిమించినన్
మెదలకజాటిపాటు క్రియ ♦ మెల్లఁగఁగ్రుంకెను భానుఁడత్తఱిన్

ఉ. రెండవనాఁడు శంబరుఁడు ♦ ఛేఁదులఛేని యనుజ్ఞఁబూనితా
దండధరుండు వోలెరిపు ♦ తండములన్దెగటార్ప మాళవా
ఖండలుఁడార్చి వానిఁగడి ♦ కండలుగాఁదఱిగెన్ మహోగ్రతన్
జండకరుండు మింటఁదన ♦ శౌర్యముఁజూచుచు మధ్యనిల్వఁగాన్.

ఉ. మూఁడవ నాఁటి సంగరము ♦ మోదము మీఱఁగ వేయికన్నులన్
జూడఁగవచ్చెనోయనఁగ ♦ సూర్యుఁడు ప్రాచ్యపు దూర్పుకొండపైఁ
గూడెను రెండుదండులును ♦ ఘోరముగాననిసేయ సేనకున్
నాఁడు నృపాలపాలుఁడు ధ ♦ నంజయునామునిఁ బెట్టెఁగాపుగాన్.

చ. అతఁడు పరితాపవేగమున ♦ నరకులశతంబునుమించి మించుచున్
శితతర ఖడ్గధారరిపు ♦ శీర్షములన్ దపెఁజిమ్మెఁ జెండులన్
జతురతనాడునట్లు తన ♦ శౌర్యముఁజూచిన వారలందఱున్
వెతకినసిట్టి వీరుఁడుభు ♦ విన్ మతియొకరుఁడు గల్గునేయనన్. 56

ఉ. అంతట శూరులందఱును ♦ హాయని మెచ్చఁగ మించుమించి న
న్నెంతయు బాణవేగమున ♦ నేర్పెఱఁ జూపుచు మాళవావనీ
కాంతుఁడు వచ్చి చొచ్చె రిపు ♦ కాండము బెగ్గిల సంగరస్థలిన్
వింతగఁ గ్రీడిపట్టె కురు ♦ వీరుల వ్యూహముఁజొచ్చినట్లుగాన్. 57

ఉ. చొచ్చిన వెంటఁజొచ్చి రణ ♦ శూరులు దన్నుఁబ్రచండనాయకుల్
చెచ్చెర శత్రుసేనలను ♦ జిత్రవిచిత్రముగా వధించి కా
ర్చిచ్చును బోలి యంటినఁ ♦ బ్రసిద్ధపరాక్రముఁ డద్ధనంజయుం
డెచ్చిన కినుకతో నడరి ♦ యేపునుజూపఁదొడంగె వారిపైన్. 58

ఉ. అప్పుడు మాళవాధిపుఁ డ ♦ హర్పతితేజుఁడు తచ్చమూపతిన్
రొప్పరమైనవేగమునఁ ♦ దెంపునఁదాఁకి కృపాణధారకున్
జప్పున వానిశీర్షమును ♦ శౌర్యముతోఁ బలివెట్టి వైరులన్
గుప్పలుఁదిప్పలై పడఁగఁ ♦ గూల్చి యదల్చెను శత్రుశేషమున్. 59

తే. అంత నాయస్తగిరి యను ♦ నరఁగుమీఁద
సౌమ్యభావమ్ము పూని యీ ♦ జగతికెల్ల
శాంతిపాఠమ్ము సంగెడు ♦ సాధువోలె
భాసిలుచునుండె నాలోక ♦ బాంధవుండు. 60

తే. అప్పుడాలమ్ముఁ జాలించి ◆ యమలయశుఁడు
ధర్మపాలుఁడు దళముల ◆ దయదలిర్ప
నరసి యుత్సాహమును గొల్పి ◆ యంతవచ్చి
స్నాన మొనరించి ధౌతవ ◆ స్త్రములఁ దాల్చి. 61

తే. స్వచ్ఛమైనట్టి భక్తితో ◆ స్వప్రకాశుఁ
గొలిచి భోజన మొనరించి ◆ కొలువుదీర్చి
మేటిమగలను మన్నించి ◆ నాఁటిరాత్రి
నిర్మలం బైన మనముతో ◆ నిద్రవోయె. 62

క. ఆరేయి సార్వభౌముఁడు
పేరెన్నిక గన్నయట్టి ◆ వీరుల నెల్లన్
గూరిమితో రప్పించి వి
చారము శౌర్యమ్ముఁ గొల్పు ◆ సరణిం బలికెన్. 63

సీ. సమరభీష్ముండని ◆ చాలసేనమ్మిన
పృథుబలుండు సుబలుండు ◆ పడుటఁ జూచి
శౌర్యసమగ్రుండు ◆ సంగరద్రోణుండు
శంబరుం డనిలోన ◆ సమయఁ జూచి
యరిదర్పభంజనుం ◆ డగు ధనంజయుఁడును
దురమున నసువులు ◆ దొలఁగఁ జూచి
వేనవేల్ వీరులు ◆ వీఁకతోఁ బోరాడి
రణరంగమందున ◆ రాలఁ జూచి
యోర్చియుండెదు నాకు నీ ◆ యుర్విలోన
సార్వభౌమాంక మేల మీ ◆ సఖ్య మేల
యొక్కఁడే పోరి రిపుతలఁ ◆ జెక్కువాఁడఁ
దక్కినన్ వీరకలోంబు ◆ నెక్కువాఁడ. 64

చ. అనిన నృపేంద్రచంద్రునకు • నారణధీరుఁడు గేలుమోడ్చి యో
జననుతకీర్తి నీవు గను • సన్నయొనర్చినఁ జాలు చేపు నీ
కనులకుఁ బండువౌనటులు • గట్టిగ వేచెఱపట్టి యారిపున్
గొని యిటు వచ్చువాఁడ నిది • గో శపథంబని యార్చి పేర్చినన్.

క. మణిమయమౌ హారం బా
రణధూర్వహు కంఠమందు • రారాజిడి యో
రణధీరా ! కొను జయమన
ధణధణ నిస్సాణరవము • తద్దయు మ్రోసెన్. 66

తే. ఇట్లు రణధీరు మన్నించి • యెలమి నించి
దండనాథులఁ జూచి యీ • ధైర్యనిధికిఁ
దోడుపడుఁడని శాసించి • వీడి కొలువు
నెమ్మదిగ సార్వభౌముఁడు • నిద్రవోయె. 67

క. తన ఫౌజుల నారేయినె
తనుఁ బతిమెచ్చంగ నడపి • దాయల చుట్టున్
వననిధి చుట్టిన తెఱఁగున
నునిచెను రణధీరుఁ డెంత • యును జిత్రముగాన్. 68

క. నమ్ముము మాళవపాలా
యెమ్మెయి సత్కీర్తి నిన్నె • యెంచివరించెన్
ముమ్మాటికి నిజమిది నై
కొమ్మా యని కోళ్ళు కొక్కొ • కో యని కూసెన్. 69

క. కని రణధీరుని తంత్రము
మునుముందుగఁ దెలుప మాళ్వ • భూపాలునకున్
దినపతి యంపిన సూచన
యన వేగుఁజుక్క పొడిచె • నమరేంద్రుదిశన్. 70

తే. ఉదయరాగంబుతో లేచి ♦ హృదయమందు
ధర్మపాలుఁడు పరమేశుఁ ♦ దలఁచు సరికి
చారులరుదెంచి మనచుట్టు ♦ శత్రుసేన
ముట్టెనని తెల్ప నాజగ ♦ జెట్టి యుగ్రుఁడు. 71

తే. ప్రాణములు దాల్చి జీవచ్ఛ ♦ వంబు లట్లు
బ్రదుకుకంటెను ఘోర సం ♦ గ్రామమందు
శత్రులను జీల్చి చెండాడి ♦ స్వర్గమందు
నెమ్మదిగనుంట సర్వోత్త ♦ మమ్ముగాదె. 72

తే. అనుచు వీరులఁ బురికొల్పి ♦ హయము నెక్కి
చండతర ఖడ్గమును బూని ♦ సమరభూమి
ధంధణార్భటితోఁ జేరె ♦ ధైర్యజలధి
శత్రుసేనాసముద్రంబు ♦ నరకఁ గొనక. 73

తే. సర్వసేనాధిపత్యంబు ♦ సరగఁ దాల్చి
చటులతర ఘోటకము నెక్కి ♦ సంభ్రమమున
మించి రణధీరుఁ డెలుఁగెత్తి ♦ మిత్రులార
తడవ చేలిఁక నరులపై ♦ నడరుఁ డనియె. 74

క. భేరీ ఝాంకారమ్ములు
దారుణఘుంకారములును ♦ దర్పిత భటహుం
కారములు నెలఁగ నిరుదెస
వారలు దలపడిరి బాల ♦ భానుఁడు చూడన్. 75

తే. సంద్రమును మించి పొంగెడు ♦ సార్వభౌము
బలములకు ముందు మాళవ ♦ పాలు దళము
చిన్నదీవినిఁ బోలియుఁ ♦ జెలఁగి చెలఁగి
చిత్రతరముగ యుద్ధంబు ♦ చేసి పడిసె. 76

ఉ. అత్తఱి ధర్మపాలుఁడు మ ♦ హారణకాలుఁడు కేళిఁబోలి తా
నెత్తినకత్తి యెత్తినటు ♦ లెక్కడఁ జూచినఁ దానెయూనఁటుక్
చిత్తమువచ్చినట్టులు వి ♦ చిత్రగతిన్ విహారించి పోరిలో
నెత్తురుటేరుఱులంబఱపి ♦ నిల్చెను డస్సి హాయంగ యూఁతగాన్

తే. నిలిచి యాలీల నలుదెస ♦ నలమికొనుచు
వచ్చు రిపులను జూచి వి ♦ వ్వచ్చుపగిది
నడరఁజూచియు దేహమ్ము ♦ బడలియుంట
వశముగాకున్న శిరమును ♦ వాల్చియుండె. 78

ఉ. అంతకుమున్న యుద్ధమున ♦ నారణధీరు పరాక్రమాగ్నిచే
సాంతముగా నశించిన స్వ ♦ సైన్యగతిన్ దలపోసి పోసి సు
స్వాంతమునందు నాపరమ ♦ శాంతుని ధ్యానమొనర్చి కొంతవి
శ్రాంతినిఁ గాంచ నుండఁగ వె ♦ సన్ జెఱపట్టెను శత్రువాతనిన్.

ఉ. అప్పుడు మాళవాధిపతి ♦ హర్షముతోఁ బరమేశుఁ గూర్చియో
యొప్పులకుప్ప యీదశకు ♦ యోగ్యునిగా నను నెంచినాఁడవే
చెప్పఁగరాని చిత్రములఁ ♦ జేసెడివాఁడవు దీనిలోపలం
దప్పక నీకృపామృతము ♦ దాఁచకమానవు గాద యీమయా. 80

తే. అనుచు శాంతముతోనున్న ♦ యన్నరేంద్రు
గౌరవముతోడ నారణ ♦ ధీరుఁడపుడు
సార్వభౌమునికడఁజేర్చి ♦ సంభ్రమమున
నెంతయునుభక్తి నృపపతి ♦ చెంతనిలిచె. 81

క. మందారుండా నృపతికి
సుందరపీఠంబొసఁగి ♦ శుభవీక్షణలన్
బొందుగరణధీరునిపై
మందారసుమంబులట్లు ♦ మఱిమఱిఁగురిసెన్. 82

ఆ. అంతధర్మపాలు • సాదరమునఁజూచి
మీపరాక్రమంబు • మెచ్చువచ్చె
మించివెలయునట్టి • మీరాజధానిని
జూచువేడ్కఁగలదు • శుభచరిత్ర. 83

తే. అనుచు రణధీరుఁగాంచిన • నాతఁడపుడె
యధిప! యంతయుసంసిద్ధ • మనుచుఁదెలుపఁ
బ్రబలమైనట్టి చతురంగ • బలముతోడ
వెడలెమానవనాథుని • వీడుపట్టి. 84

ఉ. అక్కడ మాళ్వసేంద్రపుర • మందలి యంతిపురంబులోపలన్
జక్కనిమేడపై సరళ • చల్లనిగాలిని గూరుచుండితా
నక్కరుణా సుధాబ్ధియగు • నప్పరమేశునిఁ గొల్చుచుండఁగా
నక్కడికేగుదెంచెను స • మాదరచిత్తముతోడ భద్రయున్. 85

తే. అంతవిజయేంద్రుఁ డేతెంచి • యమలభక్తి
తల్లికిని భద్రకును మ్రొక్కి • తండ్రిఁదలఁచి
వీనులకువిందు గొలిపెడు • విజయవార్త
లిందుఁగలవేని దెలుపుము • విందుజనని. 86

తే. అనినఁదనయుని వాత్సల్య • మొనరఁజూచి
పూజ్యుఁడగు నీదుజనకుండు • మొన్ననిన్న
మనకుఁ బంపినవార్తల • వినిచితిఁగద
నేఁటివార్తలదేలకో • నిలిచెరాక. 87

తే. సంజగావచ్చె మనములు • సంచలించె
నెట్లుగానున్నదో కదా • యీశ్వరేచ్ఛ
విజయమగుఁగాక నాప్రాణ • విభునకెపుడు
సుగుణమణిగణ ఖనియగు • శుభునకెపుడు. 88

తే. అని సరళతత్త్వశీలభద్రయామెఁజూచి
రాణినేనెంత దౌర్భాగ్య • రాలనమ్మ
యుండదశినిఁ గష్టములమ్ముంచి • యిబ్బిధమున
బ్రదికియున్నాను జీవచ్ఛ • వంబుపోలె. 89

తే. అనుచునుండఁగఁ బురమెల్ల • నాక్షణంబ
కొల్లవోయిన యట్టులు • గొల్లుమనియె
భటుఁడొకఁడు వేగఁబఱతెంచి ప్రభువుగారు
చెఱనుబడిరని చెప్పిని • శ్చేష్టుఁడయ్యె. 90

తే. పిడుగుఁబోలిన యీవార్త • వినెనొలేదొ
పుడమిపైఁబడి సరళదా • మూర్ఛవోయె
నేడ్పుచే భద్రికత్తుక • యెండిపోయెఁ
బురము దుఃఖాబ్ధిలోఁబడి • మునిఁగిపోయె. 91

ఉ. ఆవిజయేంద్రుఁ డప్పుడు మ • హాగ్రహ వేగము చేతరోఁజుచున్
దావకృశానుఁడై యడరి • తాలిచిఖడ్గముఁ జేకి యాభటున్
భూవరచంద్రు నాజనకుఁ • బోరునఁబట్టిననీచుఁ డెవ్వరా
కావరమింక వానితల • గ్రుక్కిన వ్రక్కలు గాఁగఁ జేల్చెదన్. 92

క. అనుచున్ దనయుండాడెడు
ఘనవీరాలాపమపుడు • కర్ణామృతమై
తనమూర్ఛఁ బోఁదోలంచిన
వనితామణి సరళ లేచి • వాత్సల్యముతోన్. 93

క. ఔరా మతుకులభూషణ
యారా శౌర్యావతార • యారాతండ్రి
యారాణీబోఁటి సుతుం
డేరాజునకుండు నతఁడె • యిలధన్యుఁడురా. 94

క. పదియాఱేండ్ల వాఁడవు
కదనంబొకసారి యే నిఁ ♦ గనియెఱుఁగవు నే
నదనెఱిఁగి నీకుఁదెలిపెదఁ
బదపోదమురమ్ము పుత్ర ♦ ప్రస్తుతిపాత్రా. 95

తే. అనుచుఁదనయుని నోదార్చి ♦ జననిఁజేరి
చెప్పఁగానంత దుఃఖమ్ము ♦ చేతఁగలఁగి
కన్నులను నీరుకాల్వలై ♦ కాఱుచుండ
భద్రవాపోయె నిట్టులా ♦ పదలఁదలఁచి. 96

సీ. కన్నవారలు నన్నుఁ ♦ జిన్ననాఁడే వీడి
చయ్యన నేగిరి ♦ స్వర్గమునకు
వలచినవరుఁడు నా ♦ వలపుఁ జూడకముందె
వీరలోకంబును ♦ జూఱగొనియెఁ
బెంచిననాయన్న ♦ ప్రేమమించుక లేక
క్రిందుమీఁదెఱుఁగక ♦ కినిసియాడె
ననుఁజేరనిచ్చిన ♦ న్యాయస్వభావుండు
వైరిచేఁ జెఱవోయెఁ ♦ బోరిలోన
నాత్మహత్యకు నొప్పదీ ♦ యంతరాత్మ
యేమి సేయుదు నెటఁబోదు ♦ నెవరిపాలఁ
బడుదునో దేవదేవా ! కృ ♦ పాప్రభావ
యేల నావంటి దౌర్భాగ్య ♦ రాలు జగతి. 97

తే. అనుచుఁ బొక్కెడు భద్రన ♦ కుఱ్ఱనను జేర్చి
చీరచెఱఁగునఁ గన్నుల ♦ నీరు దుడిచి
ప్రేమదొలఁకెడు చూపుల ♦ మోముఁజూచి
సరళ యిట్లనిపలికె నా ♦ సాధ్వికపుడు. 98

తే. పతిసతులు సర్వమొక్కఁడై ♦ పరఁగుకతనఁ
బతిప్రతిజ్ఞను నెఱవేర్ప ♦ సతికివలయుఁ
గాన నినుఁ గాచుభారంబు ♦ పూనుదాన
స్వామియాజ్ఞను దలఁదాల్చి ♦ ప్రబలుదాన. 99

తే. అనుచు నిద్దఱఁ దోకొని ♦ యరిగి సరళ
సర్వరక్షకు సర్వాత్ము ♦ సర్వవేద్యుఁ
దలఁచినకొలంది ధైర్యంబు ♦ దళుకులొత్త
రేయిఁబవలును నడచుచుఁ ♦ బోయిపోయి. 100

మ. నటదుత్తుంగతరంగమాలికలతో ♦ నానాజలౌకాళితోఁ
దటభాస్వత్పటు పాదపవ్రజముతో ♦ ధావత్ప్రవాహంబుతోఁ
జటులోద్ధూతవరాంబుశీకరలస ♦ చ్ఛాంతాచ్ఛవాతంబుతోఁ
నటరంజిల్లెడు శ్యామలానదిఁగనెన్ ♦ హర్షప్రకర్షంబుతోన్. 101

ఆ. అంత నా స్రవంతి ♦ చెంత నా ముప్వురు
దివ్యదృశ్యములను ♦ దేవదేవు
మహిమఁ జూచి చూచి ♦ మది సంతసిల్లుచుఁ
గొంతకాలముండి ♦ యంతమీఁద. 102

సీ. అలలపై నెలమి ను ♦ య్యాలలూఁగుచుండెడు
రాజహంసమ్ముల ♦ రహిని మీఱి
చప్పుడింతయులేక ♦ యొప్పుతో నడు నీటఁ
జెరలాడు చేఁపలఁ ♦ జెన్ను మించి
భూరివేగమున గం ♦ భీరజలమ్ములఁ
బాఱు నక్రమ్ముల ♦ భాతిఁ దెగడి
కడలిలోపల నల్ల ♦ కల్లోల మొనరించు
తిమితిమింగిలముల ♦ తెఱఁగుఁ దన్ని

యొంతయును జితశ్రీతుల ♦ నీఁదియీఁద
వీరులానది దాఁటిరి ♦ వేదక్రమీటి
యిద్ధచరితులు భవముఁ ద ♦ రించుకరణి
నద్భుతమువారివారి వి ♦ హారసరణి. 103

తే. దాఁటి శ్యామలనీలీల ♦ ధైర్యధనులు
దైవమునె నమ్మి యూఁతగాఁ ♦ దనరి తనరి
యడవులను గుట్టలను బడి ♦ యలసియలసి
విడక రాత్రియుఁ బవలును ♦ నడచి నడచి. 104

ఉ. కాంచిరి కష్టముల్ సుకము ♦ కావడకుండలు వీనికెప్పుడున్
సంచలనంబు నొందక ప్ర ♦ శాంతమనస్కత సాధువృత్తితో
మించిన భక్తి నీశ్వరున ♦ మేయునిఁ గొల్వుఁడు మీరలంచు బో
ధించుమునీంద్రుచందమున ♦ నెంతయుఁ బొల్చె ధరాధరేంద్రముల్.

క. హారావళి యను నాగిరిఁ
జేరంజని సరళసరళ ♦ చిత్రముతోడన్
భూరిమహీధ్రముఁ జూపుచు
నారమణికి భద్రకనిరొ ♦ నంచితసరణిన్. 106

సీ. నానెలయేఱుల ♦ స్నానపానమ్ముల
నెలమితో నొనరించి ♦ చెలఁగుఁ డీరు
నాభవ్యతరువుల ♦ శోభిల్లుఫలముల
నాహార మొనరించి ♦ యలరుఁ డీరు
నాగుహాంతరముల ♦ నాగుణాకరులీల
భక్తితో ధ్యానించి ♦ పరఁగుఁ డీరు
నాపాలిశత్రులఁ ♦ జూపువాలనిలీల
మించుసేమమ్మున ♦ మెలఁగుఁ డీర

అనుచుఁ బలెక్రీడుఁ జూడుమీ ♦ యదిరిరాజు
మనకు భగవంతుఁడే యిట్టి ♦ ఘనునిఁ జూపెఁ
గాన నీమహనీయుని ♦ కడనయుండి
యీవిపత్సాగరముదరి ♦ యింపవలయు. 107

తే. అనుచు నాకొండమీఁదికి ♦ నరిగి యచటఁ
జక్కఁగాఁ బొల్చు నొక పర్ణ ♦ శాలఁ గట్టి
యందు వసియించుచుండిరి ♦ హర్షధాముఁ
డగు పరాత్పరుఁ డేవారి ♦ నరయుచుండ. 108

మ. అటమందారుఁడు ధర్మపాలునగరిన్ ♦ హర్షంబుతోఁ జేరియం
తటభద్రిన్ వెదకించియెచ్చటను ద ♦ త్తన్విన్ బుద్ధిన్ గానమిన్
గుటిలాత్ముండని మాళవేంద్రుఁ జెఱన్ ♦ గ్రూరంబుగాఁ బెట్టి తా
నటు నాపట్టణమందెయుండెఁ బ్రజ ♦ హాహాకారముల్ సేయఁగాన్

మాలినీ.

మతిజితరిపుసూత్రా ♦ మంగమాంబాసుపుత్రా
ప్రతికవినుతిపాత్రా ♦ రాజరాజేంద్రమిత్రా
అతులగుణపవిత్రా ♦ అచ్ఛతేజోబ్జమిత్రా
సతతశుభచరిత్రా ♦ సజ్జనోద్యానచైత్రా. 110

గద్య.

ఇది శ్రీ పరమేశ్వరకరుణాఫలితలలితకవితాకలిత శ్రీ రామలక్ష్మాంబా బుచ్చివేంకయామాత్యతనూజాత సకలసజ్జనవిధేయ ఆదిపూడి సోమనాథనామధేయ ప్రణీతంబయిన శ్రీ విజయేంద్ర విజయంబను సుప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.





శ్రీ

# విజయేంద్ర విజయము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీవైభవ దేవేంద్రా
కేవల విద్యాపరిచార • కృష్ణమహీంద్రా
పావన గుణగణసాంద్రా
రావుకులక్షీరజలధి • రాకాచంద్రా. 1

క. ఆలింపుము మందారుం
డాలీల స్వధర్మపాలు • ననుపమశీలుం
జాలిగొనక చెఱలోనిడి
యేలెన్ మాళవము ప్రజల • కెల్లను బులియై. 2

క. ఆ ఱేఁడు లిట్లుగడచిన
నా ఱేఁడుల ఱేనిసుతకు • హర్షలతకుఁ జే
కూరెను యౌవనరాజ్యం
బేరను వర్ణింపఁగాని • యింపున్నింపెన్. 3

తే. అవయవంబులు స్ఫుటములై • యలరఁ దొడఁగె
వింతగా మేనిలోనొక • కాంతిగలిగె
స్వరము హృద్యమ్ముగా మాఱె • సౌరుమీఱె
బాలయాలీల నప్పుడు • కేళిసలిపె. 4

ఉ. చెంగున నెక్కి గుఱ్ఱమును ♦ జేతుల బంతులు దాల్చి యాడెడిన్
మంగళగీత జాతముల ♦ మాటికిఁ బాడుచు వీణె మీటెడిన్
ముంగురు లెంతయుం గదల ♦ ముచ్చటనుయ్యెల లూఁగుచుండెడిన్
న్బొంగి జలాశయమ్ముల వి ♦ నోదము మీఱఁగ నీఁదులాడెడిన్. 5

మత్తకోకిల.

ఎల్లవిద్దెలఁ బుట్టినిల్లయి ♦ యెంతయుం గరుణాఘనై
తల్లి నిన్నుఱపించి వెళ్లెడు ♦ ధర్మమార్గ వినోదయై
యుల్లమందుఁ బరేశు నెప్పుడు ♦ నుంచి కొల్చెడు భక్తయై
యెల్లరుం దను మెచ్చుచుండఁగ ♦ వింతి యొప్పెను ధన్యయై. 6

సీ. ఒకనాఁడు కన్య ♦ యుచితరీతి నిద్రించి
దర్శింప నాతఁడు ♦ దయ దలిర్ప
నమ్మ కూర్చుండవే ♦ హర్షలతా యని
పీఠమ్ము వెట్టించెఁ ♦ బ్రియతనయకు
దానిపైఁ గూర్చుండి ♦ తండ్రి నే నొకమాట
విన్నవింపఁగ వచ్చి ♦ యున్నదాన
ననిన మాయమ్మరో ♦ యది యేమి తెలుపవే
వీనుల విందుగా ♦ విందుఁ దల్లి
యనిన నామె మనమ్ములో ♦ నమలమైన
భక్తి పొరలుచు వచ్చినఁ ♦ బరమపురుషుఁ
దలఁచి కన్నులయందుండి ♦ ధార గాఁగఁ
దొరఁగు హర్షజలమ్ములఁ ♦ దుడిచి పలికె. 7

సీ. బ్రహ్మాండకోటుల ♦ భరియించి సతతమ్ము
కరుణాస్వరూపుఁడై ♦ కాచువాఁడు
సుందరస్వర్గమో ♦ నందనోద్యానమో
కామధేనువొ కాక ♦ కల్పతరువొ

యననలరారునీ ♦ యార్యభూమి సృజించి
యురు కృపామృతమును ♦ గురిసినాఁడు
కూర్మిమైమదిని స ♦ ద్గుణముల నాటంగఁ
బ్రబలుతొ భక్తులఁ ♦ బంపినాఁడు
వారిలోపలఁ బూర్ణశు ♦ భ్రాంశువోలె
వెలుఁగుచున్నాఁడు బౌద్ధుఁడన్ ♦ విమలకీర్తి
ధరణినంతను దయచేతఁ ♦ దడుపఁబూని
సర్వమర్పించి చెలఁగిన ♦ శాంతమూర్తి. 8

తే. అమ్మహాత్ముని బోధామృ ♦ తమ్ముధరణి
నెఱపఁగానెంచి చెల్లెలి ♦ నెమ్మిఁగాంచి
యమ్మ సన్న్యాసురాలవై ♦ యలరుచుండి
ధర్మమంతటఁ జాటుమో ♦ నిర్మలాత్మ. 9

తే. అనుచుఁ బంపెనుబరదేశ ♦ మమలకీర్తి
సర్వవినుతుఁడశోకుఁడన్ ♦ చక్రవర్తి
శాక మేకాని మాంసమ్ము ♦ చవిగొనండు
సాదరంబుననెల్లర ♦ నరయుచుండు. 10

క. అతని శిలాశాసనతతి
యతులితమై వెలయుచుండు ♦ నంతటనిపుడున్
వెతకిన నతనిసమానులు
కుతలమ్మున నుండఁబోరు ♦ క్రూరులు నృపతుల్. 11

ఉ. ఎందఱురాజులిద్ధరణి ♦ నేలిరిగారునృపాల కోటిఁబూ
ర్ణేందునిమించి వెల్గెడున ♦ రేంద్రునశోకునిఁ బోలినారెయా
యందమువేఱుచందము ద ♦ యాగుణకందము దానియందునే
కందును జూపఁజాలమిఁకఁ ♦ గల్పశతంబులువేచి చూచినన్. 12

తే. అతఁడు మీ రేలు మగధనే ♦ యప్పు డేలెఁ
గాన మీరమ్మహాత్ము ధ ♦ ర్మానుసరణిఁ
జెల్లెలిని నాదరించుచుఁ ♦ జెలఁగవలయు
మాంసభక్షణమును మాని ♦ మనఁగవలయు. 13

తే. పతితపావనభక్తహృ ♦ త్పద్మసదన
సూరులందఱు నభినవా ♦ శోకుఁడను మ
నాదు జనకుని బొగడంగ ♦ మోదమందు
భాగ్యమది నాకుఁ గల్గునె ♦ పరమపురుష. 14

ఆ. అనిన హర్షలతను ♦ సాగరమ్మనఁ జూచి
యమ్మ! భద్ర లేదె ♦ యాదరంప
సేమి సేయువాఁడ ♦ నెక్కుడుఁజనువాఁడ
ననుచు నుమ్మలించె ♦ ననని విభుఁడు. 15

తే. అంతలో నొక్కఁ డరుదెంచి ♦ యధిప! యధిప!
క్రూరమృగములు గ్రామముల్ ♦ దూఱెఁ దూఱె
భూవరుల కార్త రక్షణా ♦ భూషణంబు
కాన వెడలుము వ్యాఘ్రసం ♦ ఘములఁ దునుమ. 16

తే. అనిన వానికి నిదె వత్తు ♦ ననుచుఁ దెలిపి
పంచి హర్షలతం జూచి ♦ బాల! చెపుమ
వ్యాఘ్రమును మాంసహారిని ♦ వసుధ నేల
దేవుఁడు సృజించి శౌర్యంబు ♦ దీనికొసఁగె. 17

తే. అనినఁ జిఱునవ్వు నవ్వి యా ♦ యన్నుమిన్న
కన్నతండ్రికి మనమున ♦ నున్న చిన్న
సంశయమ్మును నెఱఁగిమ్మ ♦ చతురసరణిఁ
బలికె నిట్టులు వినయమ్ము ♦ దళుకులొత్త. 18

చ. తమతమ జట్టువీడనివి ♦ ధర్మ్ములజంతుల నాజ్ఞవెట్టఁగా
సమద మృగోత్కరమ్ములను ♦ సంసృతిలో సృజియించి దేవుఁడ
క్రమముగఁ జేర్చిబొబ్బలమె ♦ కర్మ్ములుగ్రామములందుఁజొచ్చినన్
మముసృజియించెవానిఁదును ♦ మాడఁగనార్తులయార్తిఁదీర్పఁగాన్

తే. సములనధికులతోఁ బోర ♦ శౌర్యమగును
దీనరైయొంటి దిరిగెడు ♦ దానిమీఁద
కుఱికి వ్యాఘ్రంబుచూపెడు ♦ నుగ్రవృత్తి
క్రౌర్యమగుఁగాక కేవల ♦ శౌర్యమగునె. 20

చ. అనిన మహీంద్రుఁడా మెకను ♦ నమ్మరొ సృష్టినిజూచికాదె యీ
మనుజుఁడు నేర్చుచుండును స ♦ మస్తగుణంబులుగాన మాంసమున్
దినెడుమృగంబులం గనుచుఁ ♦ దేఁకువఁబ్రాణులఁజంపికూరిమిన్
దనకశనంబుచేసికొనుః ♦ దప్పనియెంచక మానవుండిలన్. 21

చ. అనినఁగృపా స్వరూపయగు ♦ నాసుతయిట్లను మీనుమీనులన్
దినఁగనుజూచి మానవుఁడు ♦ దెంపునమానవునిన్ భుజించునే
మనకుఁ బరాత్పరుండు పెఱి ♦ మన్ దయచేసిన బుద్ధిఁజూపఁగాఁ
జనదె సమస్తకార్యముల ♦ సర్వమెఱింగిన మీకుఁ దెల్పనే. 22

తే. ప్రాణిప్రాణంబు దీయుట ♦ పాపమంచుఁ
దెలియఁడెవ్వఁడు జిహ్వను ♦ ద్రిప్పలేక
నరకమార్గంబులోఁ బడి ♦ సరకుగొనక
వంచనముసేయఁబూనునీ ♦ శ్వరునిగూడ 23

తే. అనుడుఁ జిత్తంబు పరకృపా ♦ యత్తమగుడు
నమ్మ! నమ్ముము నేనుమాం ♦ సమ్ముదినను
గాని వేఁటనురణమునఁ ♦ గడఁగినపుడు
ప్రాణులను జంపకుండఁగాఁ ♦ బరఁగుటెట్లు. 24

తే. అనిన ధర్మమ్ములన్నియు ♦ నరసినట్టి
పరమకోవిదయగుట వా ♦ భవ్యచరిత
హంసలత సెప్పె నివ్విధి ♦ నవనిపతికిఁ
జక్రిఁగాఁ దెలియునట్లు ని ♦ స్సంశయముగ. 25

తే. క్రూరమృగములఁ వైరులఁ ♦ గూల్చుటరయఁ
బ్రజల రక్షించుటకుఁ గాన ♦ రాజులకును
ధర్మమైయొప్పు దీనిని ♦ దప్పువార
లిందునందును సౌఖ్యమ్ము ♦ లందలేరు. 26

మహాస్రగ్ధర.

జనకా నీవెంట వత్తున్ ♦ సరసరపులులన్ ♦ జంపిచెండాడి త్రుంతున్
వనమున్ వేవేగఁ జొత్తున్ ♦ వనమృగతతులన్ ♦ వాలునన్ జీల్చి [illegible]
నను నేఁ జెప్పంగఁ జాలన్ ♦ నవనవ విధులన్ ♦ స్సంచరింతున్ గలంతున్
గనమీరల్ నాదుశక్తిన్ ♦ గడఁగెదను గతిన్ ♦ గా[illegible]సాన
దైన్. 27

తే. అనుచుఁ జేలమ్ము నెగఁగట్టి ♦ యాడుచుండు
కొంగుఁ జక్రిఁగదోఁపి ముం ♦ గురుల దువ్వి
వేణిఁ జొల్లెముగాఁ బెట్టి ♦ వీరరసముఁ
గ్రుమ్మరించుచు మోమునఁ ♦ గొమ్మనిలిచె. 28

తే. చూచి భూవిభుఁ డామెను ♦ జోద్యమంది
యమ్మ నాచిన్నిముద్దుల ♦ గుమ్మరమ్మ
వేఁటలో నీవు విహరించు ♦ విధముఁ గాంచి
ధన్యుఁడయ్యెద మత్ప్రియ ♦ తనయ! యనియె. 29

ఉ. అంతట వారలిర్వురహ ♦ యంబుల నెక్కి కృపాణపాణులై
వింతగ నందఱుంగనఁగ ♦ వేఁటకు వెళ్ళిరి ధంధణార్భటిన్

బంతములాడుచుఁ జక్క శునక ♦ వర్గముఁ బోఁగొని సాధనాళితోఁ
జెంతలముందు వెనకలఁబ్ర ♦ సిద్ధులు బోయలు గొల్చుచుండఁగా౯

తే. జనకుఁడును సిద్ధయీరీతిఁ ♦ జనివనమ్ముఁ
జొచ్చివిడిసిరి యంతటఁ ♦ జుట్టునుట్టు
హర్షలతచూచి యానంద ♦ మందు మునిఁగి.
తండ్రికిట్టులు పలికె సు ♦ దామయోక్తి. 31

తే. విశ్వపతి మందిరమ్మున ♦ వేడ్క మీఱ
గుండ్రమైపొల్చు బల్లయీ ♦ క్షోణితలము
లీలగా నావసంతుఁడ౯ ♦ మాలియిడిన
చారుతరపుష్ప గుచ్ఛమ్ము ♦ భూరివనము. 32

సీ. పలురకమ్ములపూల ♦ పరిమళమ్ములఁగూర్చి
నాసకు నొడగూర్చు ♦ నవ్యసుఖము
పలుతెఱంగుల పక్షి ♦ కులరవంబులఁగూర్చి
వీనులకును గొల్చు ♦ విందుసతము
వివిధవృక్షమ్ముల ♦ వింతగా జతఁగూర్చి
యొదిగించు నిదెనయ ♦ నోత్సవమ్ము
సుమరసమ్ములనెల్లఁ ♦ జోద్యమ్ముగాఁగూర్చి
జిహ్వకుఁ దేనెచేఁ ♦ జిలుకముదము
చెలఁగి యిట్టులు చిత్రవి ♦ చిత్రగతులఁ
బరమపూరుషమహిమా ప్ర ♦ భావిభవముఁ
దెల్లముగఁ నందజెఱేఁగెడు ♦ తెన్నునందుఁ
జాటుచున్నది చూడుఁడీ ♦ చారువనము. 33

సీ. ఒడలికినెంతయు ♦ వడగాలిసోఁకుచు
దుమ్ముపైఁ గ్రమ్మఁగ్రీ ♦ ష్మమ్మునందుఁ

గాన నభ్యంగన ♦ స్నానమ్ము గొనరించె
వనలక్ష్మి చక్కఁగా ♦ వర్షమందు
నెమ్మితోఁ గూర్చుండి ♦ నీరెండలోపలఁ
దడియార్చుకొనె శర ♦ త్సమయమందు
గమగమ వాసనల్ ♦ గ్రమ్ముచుండెడునట్లు
హేమకాలమందు ధూ ♦ పమును బట్టెఁ
దలను నంటిన పొట్టును ♦ దులిపి దులిపి
చిక్కెడలించుకొనియెను ♦ శిశిరమందు
నెల్లనగలను దాల్చి స ♦ ర్వేశుకరుణ
నెంత మెఱసెనో కనుఁడీవ ♦ సంతమందు. 34

తే. అడవి నార మహద్దశ ♦ యందుఁ జెట్టి
దానిచేఁ దన్నుఁ దనచేత ♦ దానినెలమిఁ
గాచుచుండును వ్యాఘ్రిసం ♦ ఘంబు జగతి
నీశ్వరుని సృష్టివైచిత్ర్య ♦ మేమి చెపుదు. 35

తే. అనెడు నంతలోన ♦ నావల నొకవంక
భయముచేత గుండె ♦ బ్రద్దలగుడుఁ
జెట్లమీఁదనుండి ♦ చిన్నపిల్లలతోడఁ
గోఁతులఱచి కొనుచుఁ ♦ గూలెనవని. 36

తే. అంత వ్యాఘ్రి యొకటి ♦ యిచ్చటికరుదెంచె
బోయలదిగోఁగొట్టు ♦ పులిపులియని
బల్లెములను జేతఁ ♦ బట్టి కేకలు వేయ
నవుడు హర్షలతమ ♦ హాగ్రహమున. 37

క. పలకను వాలుం జేకొని
పులికెదుటను నిల్చెనదియుఁ ♦ బొంచి పయికిఁ దా

నలుక మెయి నెగురఁ బలుకన్
జులుకన గా నడ్డమిడియె ♦ సూటి మెఱయఁగాన్. 38

ఆ. ఇట్టు డాలు నడ్డ ♦ మిడె తనకత్తితోఁ
బొట్టఁ జీల్చి వైవ ♦ బొబ్బపెట్టి
భూమిమీఁద డొల్లి ♦ పులి ప్రాణములవీడె
హర్షలతను బొగడి ♦ రందఱపుడు. 39

క. వీరమణీ ! రా వేయని
కూరిమితో వెన్నుదట్టి ♦ కూఁతు శిరముఁ దా
మూరుకొనెను మనుజనాథుఁడు
సారెకుఁ గనులందు హర్ష ♦ జలములు రాలన్. 40

తే. అంతరా కన్య తండ్రికి ♦ నమలభక్తి
మ్రొక్కి యిట్లనెఁ బరమేశుఁ ♦ డక్కజముగఁ
బులికి మృదుతరమైనట్టి ♦ పొట్ట నిడియెఁ
గాన నేఁ జీల్చఁగల్గితిఁ ♦ గంటివినుతి. 41

తే. అనెడులోపల బోయలు ♦ వనముఁ దిరిగి
భక్తి కొలఁదిగఁ బండులు ♦ పలురకములు
పూవుఁదేనియతోఁ దెచ్చి ♦ మ్రొక్కి నిల్చి
యంత భూకాంతుఁ డెంతయు ♦ నలరునట్లు. 42

సీ. పనసపండులఁ గోసి ♦ తొనలుగా విడఁదీసి
యుంచె నాకునవాని ♦ నొక్క బోయ
మంచిమామిడిపండ్ల ♦ మించు కత్తిని గోసి
ముక్కలుగాఁ బెట్టె ♦ నొక్క బోయ
వెలఁగపండులయందుఁ ♦ గల గుజ్జుఁ దగఁ దీసి
యొక్కచో నిడియె మ ♦ ఱొక్క బోయ

పువ్వు తేనియ వంచి ♦ పొలుపగు దొన్నెలఁ
జక్కఁగా నించెఁ దా ♦ నొక్కబోయ
యొకఁడు వీచుచు నిలఁబడె ♦ నొక్కవంక
నొక్కఁ డేలల వినిపించె ♦ నొక్కవంక
నొకఁడు పలురవములు పల్కె ♦ నొక్కవంక
నొకఁడు విలువిద్దెలను జూపె ♦ నొక్కవంక. 43

ఉ. అప్పుడు తండ్రియున్ సుతయు ♦ నాఫలముల్ భుజియించుచుండఁగాఁ
జప్పున నొక్కకాఁపెనుము ♦ చక్కఁగ వారలపైకి దూకినన్
గొప్పన నారిఁ గూర్చి యొక ♦ క్రూరతరంబగు బాణరాజ మా
యెుప్పలకప్పనాటెను మ ♦ హోగ్రత దాని లలాటము చ్చిపోన్.

క. గిరగిరఁ దిరుగుచు నిలఁబడి
తొఱఁగెను బ్రాణంబులంత ♦ దుష్టమృగంబున్
బొరిగొనిన తనసుపుత్రినిఁ
బరమాదర దృష్టిఁ జూచి ♦ వాత్సల్యముతోన్. 45

తే. హర్షలతతలపైఁ దన ♦ హస్తముంచి
యిమ్మనూఱేండ్లు బ్రతుకవే ♦ యనుచుఁ బెట్టె
కొండవలె వచ్చి గండమ్ము ♦ కొనకు మంచు
వలెను దాఁ దేలిపోయెను ♦ బాలనేఁడు. 46

తే. అనినఁ జూచితి రాతండ్రి ♦ యాకులలము
తినెడు దీనికి నెంతటి ♦ తెగువ గలదొ
యొక్కొకప్పుడు పులినేని ♦ నుక్కడంచు
నిలను శౌర్యంబు మాంసహా ♦ రులకె కాదు. 47

ఆ. ప్రబలమైన బలము ♦ పశువులకున్నను
జగతి నిండ శత్రు ♦ చయము లున్న

బుద్ధిబలముచేత ♦ భువిలోన మనుజుండు
వీనినన్ని నోర్చి ♦ వెలయుచుండు. 48

తే. ఎంతబలమున్న శౌర్యమ ♦ దెంతయున్న
నాక్క ఙ్ఞానమ్ము చేనిది ♦ యుక్కడంగె
నెట్టిబుద్ధిని మనకిడె ♦ నీశ్వరుండు
గాంచి సుఖముల నాతనిఁ ♦ గాంచుకొఱకు. 49

క. అనుచు సుఖాలాపమ్ములు
జనకునితోఁ దనయయాడు ♦ సమయమునఘనా
ఘనముఱిమినట్లు రవములు
మనములు సంచలనమందు ♦ మాడ్కి వినఁబడెన్. 50

కవిరాజవిరాజితము.

పులులిరువంకల ♦ బొబ్బలువెట్టుచు ♦ భూరిభయంకర రూపములన్
దలఁకకవచ్చెను ♦ ధైర్యవినోదులు ♦ దండ్రియుబిడ్డయుదర్పముతోన్
దలయొకవంకకుఁ ♦ దక్లిరి కత్తులు ♦ దాల్చిహయమ్ముల నెక్కివ
డిన్
జెలఁగుచు బోయలు ♦ సింహనినాదము ♦ సేయుచు వెంటనుగొల్చి
చనన్. 51

ఉ. అక్కడఁ బర్వతంబుపయి ♦ నావిజయేంద్రుఁడు మాతశిక్షచేఁ
జక్కఁగ నెల్లవిద్దెల వి ♦ శారదుఁడై సమరాగమంబునం
దక్కజమైనపాండితిని ♦ నర్జునుమించి ప్రతాపభీష్ముఁడై
యక్కరుణాఖ్యునీశ్వరుని ♦ యాదరదృష్టిఁ బ్రవర్ధమానుఁడై. 52

సీ. వీరలక్ష్మి వసించు ♦ విపుల సభాస్థలం
బన వక్షము విశాల ♦ మగుచుఁజెలఁగ
బ్రహ్మతేజంబును ♦ బ్రహ్మరంజిల్లెడు
పద్మపీఠంబయి ♦ వదనమొప్ప

నయనాబ్జములు దయా ♦ నాట్యరంగంబులై
యెనలేనికాంతుల ♦ నీనుచుండ
శౌర్యసాగర జన్య ♦ సముదగ్ర వీచికా
ద్వయమున బాహువుల్ ♦ దనరుచుండ
నూరులేమని చెప్పను ♦ వీనులలరి
యౌరయని తలలూఁచెడు ♦ నట్టి మెఱుఁగు
భవ్యయౌవన సామ్రాజ్య ♦ పట్టభద్రుఁ
డగుచు వెలుఁగొందె మధ్యాహ్న ♦ భాస్కరువోలె. 53

తే. ఇట్లువిలసిల్లు నావిజ ♦ యేంద్రుఁ డెపుడుఁ
దనకుఁ దల్లియు గురువయి ♦ తనరుచుండి
యన్ని విధముల నరసెడు ♦ నమలమతికి
సరళకతిభక్తి సేవలు ♦ సలుపుచుండు. 53

తే. మఱియు భగవంతు సద్గుణ ♦ మహిమఁదలఁచి
మేనఁబులకాంకురమ్ములు ♦ మించుచుండఁ
గనులహర్ష జలమ్ములు ♦ గాఱుచుండ
నద్భుతానంద పరవశుఁ ♦ డగుచునుండు. 55

సీ. ఒకసారి పరమేశు ♦ నుత్సంగ మబ్బిన
యట్లైన నెంతయు ♦ నలరుచుండు
నొకసారి భగవంతు ♦ నకలంక వాక్యముల్
వినఁబడినట్లైన ♦ వీనులొగ్గు
నొకసారి తను దేవుఁ ♦ డుద్ధరింపఁగ నెంచి
నట్లైన హస్తమ్ము ♦ లట్లెచాఁపు
నొకసారి తనలోటు ♦ లకు స్వామికినిసిన
యట్లైన దుఃఖాగ్ని ♦ యందుఁగ్రాఁగు

నిట్లునిర్మల భక్తిచే ♦ నెనఁగుచుండి
న్యాయమార్గమ్ము లోపల ♦ నడచుచుండఁ
గరుణయును న్యాయమెచ్చటఁ ♦ గాంచునచట
సర్వమయుఁగాంచి నట్టులు ♦ సంతసిల్లు. 56

తే. ఇట్లు తల్లినిఁ బరమేశు ♦ నెలమితోడఁ
గొలుచుచుండియుఁ దండ్రికిఁ ♦ గలిగినట్టి
దుర్దశఁదలంచి వైరిపై ♦ దూఁకమండు
మాతయాజ్ఞ నిరీక్షించి ♦ మసలుచుండు. 57

క. ఇటులుండఁగ నొకదినమునఁ
దటుకున నరుదెంచి సరళ ♦ తననేత్రములన్
బొటబొట నీరుంగార్చుచు
నటమటతో నిట్టులనియె ♦ నాపుత్రునకున్. 58

చ. తుదిమొదలంట విద్దెలను ♦ దోరపుఁగూరిమి నేర్పినాను నన్
ముదమునఁ దేల్పఁగాఁదగదె ♦ పోయిభవజ్జనకున్ మహాత్మునిన్
మదమునఁబట్టినట్టి కృప ♦ మాలిన యాఖలునోర్చి రాఁగ దే
యిదిచనునీకుఁగాదె విజ ♦ యేంద్ర ! కుమార ! వివేకసాగరా !.

తే. తల్లిదండ్రులవెతఁ దీర్పఁ ♦ దలఁపఁడేని
దైవభక్తిని జిత్తమ్ముఁ ♦ దడపఁడేని
నరులనాజినిఁజీల్చి చెం ♦ డాడఁడేనిఁ
గలుగనేటికి క్షత్రియ ♦ కులమునందు. 60

సీ. ఈవిజయేంద్రుఁడే ♦ యెల్లవిద్దెలఁదేఱి
ఖ్యాతి నద్దిక్కులఁ ♦ గాంచునంచు
నీ విజయేంద్రుఁడే ♦ యెంతయు శౌర్యంబుఁ
జూపివైరులఁ దెగఁ ♦ జూచునంచు

నీ విజయేంద్రుఁడే • యెలమితో దీనులఁ
బోషించినకీర్తిఁ • బొందునంచు
నీ విజయేంద్రుఁడే • యీశ్వర భక్తిలో
నిరతుఁడై ధర్మాన • నెగడునంచుఁ
జెప్పుచుండిన నీతండ్రి • చెఱను బడియె
నతని విడిపించి తెచ్చుట • యర్థమయ్యె
పూతచారిత్రమును జాటఁ • బోఁగదయ్యె
యిద్ధగుణసాంద్ర నావిజ • యేంద్ర! చంద్ర! 61

క. అనినన్ జేతులు మోడిచి
జననీ నీయాజ్ఞమేలుఁ • జాలక యుంటిన్
గొనకీనాఁటికిఁ గలిగెను
జననము సఫలమ్మునాందు • సమయము నాకున్. 62

ఉ. సజ్జనవంశ కృపామయుని • మాన్యచరిత్రునిఁ బట్టినట్టియా
సజ్జనవైరిపై నడరి • సంగరమందు జయించి తండ్రినీ
వజ్జకుఁ దెచ్చి మ్రొక్కెదను • భావములోఁ బరమేశు నెంచుచున్
సజ్జననీ కృపామతిని • మాత్రికి దీవెనలిచ్చి పంపుమా. 63

తే. అనుచు హర్షభరమ్మున • నాఁపలేక
కనుల సంతోషబాష్పముల్ • గ్రమ్ముచుండ
జనని పాదాబ్జములవ్రాలె • సరళయప్పుడు
దీవెనలొసంగు చిట్టని • లేవనెత్తె 64

క. లెమ్మా విజయేంద్ర వడిన్
దెమ్మా నీజనకునిటకు • దీవెనలం గై
కొమ్మా నాప్రియతనయా
పొమ్మా దేవుండునిన్నుఁ • బ్రోచు నిరతమున్. 65

తే. వంగనేలుచునుండుమ ♦ ద్రాఘితశౌరి
సంగరాంగణభీముండు ♦ సరగనతనిఁ
జేరి పోరికిఁ బురికొల్పి ♦ భూరిజయము
గొమ్ము నాపుత్త్రరత్నమ ♦ పొమ్ము పొమ్ము 66

తే. అనిన దట్టినిఁగట్టిదే ♦ హమ్మునంటఁ
గవచమును బెట్టి తలపాగ ♦ గట్టి బాహు
పురులఁ దగిలించుకొనిపాద ♦ ములకు మంచి
రక్షలను గూర్చి పరమేశు ♦ రక్ష వేఁడి. 67

తే. ఒక్కభుజమునఁ జాపంబుఁ ♦ జక్కఁ దాల్చి
బాణములపొది మఱియొక ♦ వైపుఁ గట్టి
యొక్కచేతను గత్తిమ ♦ ఱొక్కచేత
డాలుగీలించి వెడలెన ♦ బ్బాలుఁ డార్చి. 68

తే. వెడలి యివ్విధిగిరిదిగు ♦ వీరవరుఁడు
ధరణిపయి కాలుమదగజేం ♦ ద్రునట్టుఁ జూచి
యేచి మేరువుడిగ్గు మృ ♦ గేంద్రుకరణి
భూరిశౌర్యావతారమై ♦ పొల్చుచుండె. 69

సీ. అటహర్షలతతాను ♦ హయమెక్కి వేఁటాడు
తఱిఁ బులింగని తేజి ♦ కరము బెదరి
భట్టుననుఱికెను ♦ బాణవేగమ్మునఁ
బట్టనెవ్వరికిని ♦ వశముగాక
రాళ్ళఱప్పలఁగాని ♦ ముళ్ళగుండ్లనుగాని
సరకుసేయక పాఱె ♦ సరభసమునఁ
బరువెత్తి యిట్టులు ♦ ఘట్టునఁ బడఁద్రోసె
నా మెను నంతట ♦ నదియుఁ గూలె

నంతలోపల వ్యాఘ్రంబ ♦ దట్టివచ్చి
యొక్కపెట్టున దానిపై ♦ కుటికిపట్టి
గోళ్ళతోఁజీల్చి రక్తంబుఁ ♦ గ్రోలుచుండె
మూర్ఛలోపల నక్కన్య ♦ మునిఁగియుండె. 70

క. అత్తెరువున విజయేంద్రుం
డత్తఱిఁ బోవుటనుబట్టి ♦ యప్పులినేసెన్
దుత్తుమురై యిలఁగూలఁగ
నిత్తెఱఁగుననుండుఁ గాదె ♦ యీశ్వరమహిమల్. 71

ఉ. అవ్విజయేంద్రుఁ డంతఁగనె ♦ నావలఁబోరలఁ బడ్డదానికా
పెవ్వరులేని దానిఁబర ♦ మేశ్వరుఁడేగతి యంచుమూర్ఛతో
నవ్విధినుండుదానిఁ దన ♦ హస్తమునందిడి ఖడ్గమప్పుడున్
నివ్వెఱఁగొల్పు దానిఁ గడు ♦ నెత్తుటఁదోఁగుచునుండుదానిఁదాన్

ఆ. చూచియోర్వలేక ♦ చువ్వతెఱంగున
నొక్కపరుగులోన ♦ నెక్కికొండఁ
దల్లిభద్రిలకును ♦ దానిట్టులనియెను
జాలివొంది యపుడె ♦ చనెడునట్లు. 73

తే. అమ్మ! యొకకొమ్మ చెప్పంగ ♦ నలవికాదు
మూర్ఛమునిఁగిన దక్కటా! ♦ బోరలఁబడి
గుఱ్ఱమునుబట్టి యొకపులి ♦ గొఱుకుచుండఁ
జంపితిని మీరునామెర ♦ క్షింపవలయు. 74

తే. అనిన నాతని మెచ్చుచు ♦ నాక్షణంబ
కొంతజలమును వస్త్రముల్ ♦ గొన్నిగొంచు
సరళయును భద్రిలావీరు ♦ సరణిఁజనిరి
హర్షలతయున్న చోటికి ♦ నతిరయమున. 75

తే. అంత విజయేంద్రుఁడవ్వారి ♦ యనుమతిఁగొని
తండ్రివిడిపించు కోరిక ♦ తన్నుఁదఱుమ
నీశ్వరునిభక్తిఁ దలఁచుచు ♦ హృదయసీమ
వఁగదేశపు మార్గంబు ♦ వట్టిచనియె. 76

తే. అంత భద్రయుసరళయు ♦ హర్షలతను
జేరిమెల్లఁగ నక్కన్య ♦ చేతనున్న
ఖడ్గమునుదీసివైచిరి ♦ గాలిసీల్వ
వెలికలఁబరుండఁ బెట్టిరి ♦ విసరిరపుడు. 77

తే. భద్ర తడిబట్టచే నామె ♦ వదనమెల్ల
దుడిచెఁజక్కఁగ రక్తమ్ము ♦ నొరఁగినట్టి
చోటుతెల్లను గడిగెను ♦ శుభ్రముగను
దెల్లముగ హర్షలతయని ♦ తేటపడెను. 78

తే. అప్పుడాశ్చర్య మగ్నయై ♦ హర్షలతను
జూచుభద్ర మొగమ్మునఁ ♦ జూడ్కినిలిపి
సరళపల్కెను నోభద్ర ♦ సరగఁదెల్పు
మీమెయెవ్వరో వినెదనే ♦ నెలమిమీఱ. 79

తే. అనినసరళకు నిట్లనె ♦ నమ్మ! వినుము
ఈమె నామేనగోడలే ♦ సేమిచెప్పుదు
దీనిమూఁడవ మాసానఁ ♦ దెచ్చెఁదల్లి
పెట్టి నాయొడిలోపల ♦ పెద్దదీని. 80

తే. ఏనువిడనాడివచ్చిన ♦ నీశ్వరుండు
మరల నాయొద్దకే తెచ్చి ♦ మహిమఁజూపె
నదిగోఁగన్నులు దెఱచెనా ♦ యీసమయమున
నున్నదొక యింతత్రాగింతు ♦ నుదకమిపుడు. 81

తే. అనుచు నీరను దాఁగింప ♦ హర్షలతయుఁ
దెల్వి చక్కఁగ వచ్చినఁ ♦ దేఱిచూచి
భద్ర నత్తాయనుచుఁ బిల్చి ♦ పడెను మీఁద
నత్తయను గౌఁగిలించెను ♦ హర్షలతను. 82

తే. అప్పుడన్యోన్యమును వార ♦ లగపఱచిన
యచ్ఛమౌ ప్రేమఁ గనుఁగొని ♦ యమలసరళ
ప్రేమసాగరుఁ బరిపూర్ణు ♦ విమలచరితు
సర్వసాక్షిని సర్వేశు ♦ సంస్మరించె. 83

ఆ. అంత భద్ర నడిగె ♦ నా హర్షలత యప్పు
డత్త యెవ్వరీమ ♦ హాత్మురాలు
చెప్పవమ్మ యీవి ♦ చిత్రమ్ములెల్లను
విశ్వవిభుని మహిమ ♦ విశదపడఁగ. 84

చ. అనుటయు భద్ర యిట్లనియె ♦ హర్షలతా విను మీమె ధర్మపా
లుని వరపత్ని యీ సరళ ♦ లోకములోపల నీమెఁబోలు సా
ధ్విసిఁ గనలేము నిన్నిటను ♦ దీప్యఁగనుండిన యీపులిన్ వడిన్
దునిమిన వీరుఁడీ సతిసు ♦ తుండ సమానపరాక్రముండిలన్. 85

క. అనుమాట వినినతోడనె
ఘనభక్తిని సరళపాద ♦ కంజాతములన్
దనశిరమిడి మందారుని
తనయామణి హర్షలతకు ♦ తజ్ఞతఁ దెలిపెన్. 86

ఆ. అపుడు హర్షలతను ♦ ననుపమప్రీతితో
నెత్తియమ్మ వచ్చి ♦ తేలయడవి
ననుచు సరళయడుగ ♦ నబ్బాలవినిపించె 87
జరగినట్టి కతను ♦ సంగ్రహముగ.

తే. అంత నాముప్వురునుగూడి ◆ యద్రిమీఁది
కరిగి సుఖముండిరిచ్చటఁ ◆ గానలోన
సార్వభౌముఁడువేఁటాడి ◆ సరగవచ్చి
యెంతవెతకిన సతిజాడ ◆ యింతగనమి. 88

ఉ. ఆసనిరాశఁ జేసికొని ◆ హాయని వంతమునింగి యీశ్వరా !
యీసుననేను జల్పిననె ◆ యివ్విధినన్ను దురంతచింతలోఁ
ద్రోసెనుగాని హంసగలత ◆ దోసమెఱుంగదు దాని నేలొకో
గాసిలి యార్వవ్యాఘ్రపుము ◆ ఖంబునఁ ద్రోసితివకటా విధీ.

తే. అనుచుఁ జింతాభరమ్మున ◆ నడలియడలి
చేరియోదార్చు వారలె ◆ వ్వారులేమి
సార్వభౌముఁడు గర్వమ్ము ◆ సర్వము డిగి
వచ్చిచేరెను మాళవ ◆ పాలుపురము. 90

మాలినీ. సరసవినుతిరక్తా ◆ సాధుసక్తానుసక్తా !
దురితతతివిముక్తా ◆ దుఃఖశాంతి ప్రసక్తా !
పురజన హితసూక్తా ◆ పూతసంతోషభోక్తా !
పరమపురుషభక్తా ◆ పావనాచారయుక్తా ! 91

గద్య. ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత లలిత కవితాకలిత శ్రీ రా
మలక్ష్మాంబాబుచ్చివేంక యామాత్య తనూజాత సకల
సజ్జనవిధేయ ఆదిపూడి సోమనాథ నామధేయ
ప్రణీతంబయిన శ్రీ విజయేంద్ర విజయం
బను సుప్రబంధంబునందుఁ
ద్వితీయాశ్వాసము.





# విజయేంద్ర విజయము.

## చతుర్థాశ్వాసము.

క. శ్రీయుత సుగుణకలాపా
వ్యాయామాదిక వినోద • వర్ధనభూపా
న్యాయాచరణ దిలీపా
నాయకకులదీప సూర్య • నామోత్క్షేపా. 1

తే. అవధరింపుము విజయేంద్రుఁ • డవ్యథిఁజని
వంగదేశపు మధ్యాన • వఱలుచుండు
రంగపురి పేరఁబరఁగెడు • రాజధాని
మోదమునఁ జొచ్చినడువీధిఁ • బోవుచుండ. 2

సీ. ఎవ్వఁడోయివ్వీరుఁ • డివ్వీటికరుదెంచె
వివ్వచ్చుఁ దలఁపించు • సిరిధనువాఁడు
రాజపుత్రునిబోలె • రంజిల్లుచున్నాఁడు
ఎక్కెనశ్వంబేల • చిక్కెదోకొ
బుగ్గలమీఁదను • బొల్పెడునునుకాంతి
బ్రహ్మచర్య ప్రభా • వమును దెలిపె
మోమున మనరాజు • పోలికయున్నది
దగ్గఱచుట్టమై • తనరునేమొ

యనుచు జనులాడు కొనుచుండ ♦ నరిగియరిగి
నగరుఁజేరెడు సరికి నా ♦ నగరవిభుఁడు
హర్మ్యమందుండి యవ్వీరు ♦ నట్టిచూచి
తోడితెమ్మని తనమంత్రి ♦ తోడఁదెలిపె. 3

తే. అంతసచివుఁడు పఱతెంచి ♦ యర్హమైన
గౌరవమొసంగి యతని భూ ♦ కాంతుకడకుఁ
దేఁగ నరపతి గద్దియ ♦ దిగ్గనడిగెఁ
జేతులను మోడ్చి యల్లుఁడు ♦ చెంతనిలిచె. 4

తే. అంతనరపతి యాతని ♦ నల్లుఁడనుచుఁ
దెలిసియుండని కతమునఁ ♦ దలఁకితలఁకి
యయ్య మీరెవ్వరని పర ♦ మాదరమున
నడుగ విజయేంద్రుఁ డెలమితో ♦ ననియెనిట్లు. 5

తే. మాళవము జన్మభూమి నా ♦ మాతసరళ
నన్ను విజయేంద్రుఁడందురు ♦ విన్నవింతు
ధర్మపాలనరేంద్రుండు ♦ తండ్రియనిన
గట్టిగా మామ యల్లునిఁ ♦ గౌఁగిలించె. 6

తే. ఇట్టులాలింగనమొనర్చి ♦ యెలమితోడ
నల్లునకుఁ బీఠమొసఁగియ ♦ నంతరమున
దొర్లివచ్చెడు దుఃఖమ్ము ♦ తోడ నృపతి
చెలియలెక్కడనున్నది ♦ తెలుపుమనిన. 7

తే. విభుఁడు చెలివోయె భ్రాత దాఁ ♦ బేడియయ్యె
నెచటనుండిన నేమయ్యె ♦ యీశ్వరుండె
తనకుగతియని యొకయద్రిఁ ♦ దలమునందుఁ
జలుపుచున్నది యజ్ఞాత ♦ చర్యనేఁడు. 8

చ. చెలియలిభర్తకీడెపుడుఁ • జేసియెఱుంగనిభూమిభర్తలోఁ
బలఁబరమేశునిందలఁచి • పాఁడిదొఱంగనిన్యాయభర్త దా
యలచెఱలోనఁబడ్డవల • దావిడిపింపఁగఁజెప్పుమయ్యభూ
తలమున నేమి శాశ్వతము • ధర్మముఁబాసియడంగియుంటకున్. 9

చ. అనువిజయేంద్రుపలుకులకు • నాత్మనునొచ్చినృపాలుఁడిట్లనన్
వినుతగరాధరాధరము • వీఁకను దాకిఁ జయంబుగాంచునే
యనలముమీఁద నామిడుత • యట్టుకడంగినద్రుంగకుండునే
మనమున నెంతయారిపున • మానుషతేజము ముందు నల్లుఁడా. 10

క. రారాజుపేరుఁ జెప్పిన
నేరాజును మనకుఁదోడు • నీయఁగ దగునే
యూరక తెగియించినచో
ఘోరమ్ములు గల్గుఁగాక • కొనముట్టుదుమే. 11

తే. అనిన విజయేంద్రుఁ డాగ్రహా • యత్తుఁ డగుచుఁ
బ్రళయచండాగ్ని వలెమండి • పదుచుఁ బలికె
నాత్మగౌరవ మొకయింత • యైన లేదె
యకటా! క్షాత్రము వడుగంటె • నవనియందు.

చ. బలములనిమ్ము నేనడరి • భవ్యపరాక్రమ శిఖిశోభిలన్
బ్రళయకృశానుకైవడిఁ బ్ర • భావిభవంబున సార్వభౌముని
న్నలమడియించినాజనకు • నర్మిలిఁ దెచ్చెదఁ జూడు లీలగా
బలెబలెయంచు నందఱును • భాస్థలులన్ గొనియాడునట్లుగాన్.

తే. అనిననల్లుని యుత్సాహ • మునకు మెచ్చి
యోర! విజయేంద్ర నీబోఁటి • వీరుఁ జూచి
విజయలక్ష్మి వరింపదే • విమల చరిత 14
కాని సామమ్మునకు మొదల్ • గడఁగవలయు.

తే. అనుడు విజయేంద్రుఁ డిట్లనె ♦ నవనిపతికి
బలములకు శిక్ష నేర్పుచు ♦ భవ్యసరణిఁ
గొంతకాలము గడపుదు ♦ నింతలోన
నరిమనోగత మెఱుఁగనా ♦ ననిన శౌరి. 15

మత్తకోకిల.

న్యాయశీలుని ధర్మపాలుని ♦ న్యాయమే చెఱఁబెట్టఁగాఁ
హేయమైతమ స్వచ్ఛకీర్తికి ♦ నిప్డుగూర్చెఁ గళంకముల్
న్యాయమార్గము దప్పువారల ♦ కాపదల్ ఘటియిల్లెడున్
నాయనుంగు మఱందిఁ జేయుము ♦ నాఘబంధ విముక్తుఁగాఁ. 16

ఆ. ఇట్లుసార్వభౌము ♦ నెచ్చరించెడు నట్లు
కమ్మవ్రాసి పంపి ♦ కడఁకఁజూప
సైన్యచయమునెల్ల ♦ సంశిక్షితము సేయ
నల్లువశము సేసి ♦ యలరుచుండె. 17

సీ. అటఁజక్రవర్తి దా ♦ నంతఃపురములోన
నొంటిగానుండుచు ♦ నోర్వలేని
దుఃఖాగ్నిలోఁబడి ♦ దొరలుచు నటునిటు
వాపోయె నిట్టులు ♦ వసుమతీశ
సర్వమంగళ వాసె ♦ సర్వమంగళములు
నామెతోనే పోసె ♦ నాకనవని
భద్రి నన్విడనాడె ♦ భద్రమ్ము లెల్లను
నాఁటితోనే వీడె ♦ నాకు ధరణి
హర్షలతయె నాకున్న ♦ హర్షమెల్ల
యూడ్చుకొనిపోయె నయ్యయో! ♦ యొంటినైతి
సార్వభౌమాంక మేల నా ♦ శౌర్యమేల
యుర్వి నాబోఁటిదౌర్భాగ్యుఁ ♦ డున్నవాఁడె. 18

క. అనివ్యాకుల పడుచుఁ జెడు
జనపతిపతికడకువంగ • జననాథుని క
మ్మను దెచ్చి యిచ్చెనొక్కఁడు
మనమటు సరలించి చదివె • సుందారుండున్. 19

తే. చదివియందలి సత్యంబు • చక్కనరసి
ధర్మపాలుని శీలంబుఁ • దలఁచి తలఁచి
యితసి నిప్పుడువదల న • గేషుస్త్రేల్లఁ
జులక్రనగఁ జూతురనుచుఁ దా • నుబ్రియుబ్రి. 20

తే. శౌరిశోఁబోరి కొండునే • స్వర్గసుఖము
నంతతో వెతలన్నియు • నంతరించు
ననుచు నిశ్చయమును జేసి • కొని విభుండు
లేఖయొక్కటి శౌరికీ • లీలవ్రాసె. 21

తే. ధర్మపాలునిఁ బణముగా • ధరణినొడ్డి
తొడరుచున్నాను సంగర • ద్యూతమునకు
నీకు నీక్రీడలోపల • నేరుపున్న
గెలిచికొనిపొమ్ము మఱిదినిఁ • బలుకు లేల. 22

తే. అనుచు వ్రాసినకమ్మను • నతిరయమున
శౌరికడకంపి రణధీరుఁ • జేరఁబిలిచి
యోజికిని సేనలనుగొల్వ • నాజ్ఞయొసఁగి
యంతిపురిలోన నుచితకృ • త్యములనుండె. 23

తే. అచట నొకనాఁడు సరళదా • నదిమీఁద
హర్షలత భద్రిలనుగూడి • యలరుచుండి
సుతుఁడు దలఁపునకును రాఁగ • శుద్ధచరిత
యిట్లుపలుకంగఁ దొడఁగెను • నెంతయుఁదమి. 24

ఉ. "నీతులఁదూఁగు మజ్జనకు ♦ నిన్ విడిపింపఁగ మామఁ జేరినే
మాతరొ బారిసేనలన ♦ మానుషరీతినిఁ జించి వైరులన్
జేతులతీఁటఁబోఁ జమరి ♦ చెచ్చెర గెల్చెదఁ దండ్రిగారితో
నీతఱిఁ జేరి పొల్చెదను ♦ నిర్మలభక్తిని దేవుఁ గొల్చెదన్." 25

చ. అనుచుఁ బ్రితాపముల్ వలికె ♦ నీసుతుఁడేగెను నేఁటిదాఁక నా
తనితెఱఁగేమియున్ గనము ♦ తాలిమిదూలఁగఁ జొచ్చె దేవుఁడే
తనకరుణా సువృష్టిని స ♦ దాతనభక్తులఁ బ్రోచుచుండు నా
తనిపయి భారమెల్లనిడి ♦ ధైర్యముపూనుట యర్హమెమ్మెయిన్.

తే. అనుచుఁ గనులనుమూసి తా ♦ నతులభక్తి
విశ్వసాక్షిని హృదయాబ్జ ♦ వీథియందుఁ
గాంచి సంతోషమగ్నుఁడై ♦ క్రాలుచుండె
హర్షలత యప్పుడొంటిగా ♦ నవలికరిగి. 27

సీ. ఒకఱ్ఱవృక్షముక్రింద ♦ నొంటిగాఁగూర్చుండి
తండ్రిదుర్దశలను ♦ దలఁచి తలఁచి
ననుఁబాసి నాతండ్రి ♦ ఘనశోకవహ్నిలోఁ
గ్రాఁగుచుండఁగ నాకుఁ ♦ బ్రాణమిడిన
రాకొమారుఁడువోయి ♦ రణమునకై పిల్వఁ
గోపశోకమ్ములు ♦ గొలఁదిమీఱ
నెట్లుదా నడరునో ♦ యీవిజయేంద్రుండు
భండనమ్మున నెట్లు ♦ ప్రజ్వరిలునొ
యీశ్వరా! వీరికిద్దఱ ♦ కెవ్విధమున
హానిరాకుండ రక్షింపు ♦ మమితతోష
సర్వసజ్జన పరితోష ♦ శాంతిభూష
దండములొనర్తు నీకిదె ♦ ధర్మవేష. 28

ఆ. అనుచు హర్షలతయు • నాసరళాదేవి
వేఱువేఱ చోట్ల • విశ్వవిభునిఁ
గొల్చుచుండ భద్ర • కుమ్మ్రఁదాన్నాకవంక
విమలభక్తి దేవు • వేఁడెనిట్లు. 29

తే. హర్షలత విజయేందున్న • ధ్రాంగియుగసమ
నలరుచుండఁగఁ జూచుభా • గ్యమ్ముమానుఁ
ద్వరఁగఁ దయచేయవే దేవ • ధర్మభావ
శుభ్రకీర్తి రమాధవ • సుప్రభావ. 30

క. ఇవ్విధి నాముప్వరుఁగడు
మవ్యపుభక్తిం బరేశు • మదిఁగొల్చుచుఁ దా
మెవ్వగ వగలం బొందక
యవ్విభు కరుణాసువృష్టి • నలరిరిగిరిసైక. 31

ఆ. అంతవంగఁ బోల్చు • నారంగపురమున
సార్వభౌము కమ్మ • శౌరిఁజేర
నతఁడు దానిఁజదివి • యతికుపితుండయి
యల్లునకును జూప • నాతఁడార్చి. 32

చ. దిరదిరభూమి తాఁ దిరుగు • తీరున ఘోటకధాటిఁ గొల్చెదన్
సరసర వైరి శీర్షముల • సంగరభూమిని ద్రొల్లనేసెదన్
బిఱబిర శత్రుమధ్యమున • భీష్ముని మాడ్కి కలంచి మించెదన్
బొరిఁబొరి హర్షనీరముల • పూరము నీకనులందుఁ గొల్పెదన్.

తే. అనుచు వీరావతారమై • యడరునట్టి
యల్లువెన్నును దట్టియో • యార్యవినుత
సేనలను రెండు భాగముల్ • సేసియిడుము.
ఇద్దఱుఁజెలంగినడపుడ • మిద్ధగతుల. 34

తే. అనుచు మామ యెఱింగింప ♦ నల్లుఁ డరిగి
సకలసైన్యంబులను రెండు ♦ సమములైన
వ్యూహములుగాను దీరిచి ♦ యోధవరుల
కెచ్చరిక దెల్పి శౌరిని ♦ హెచ్చరించె. 35

ఉ. అప్పుడు శౌరి శౌరిక్రియ ♦ నద్భుతరీతి నలంకృతాంగుఁడై
చప్పనహేమతోఁ జెలఁగు ♦ చారుహయంబును నెక్కి కాంతితో
నొప్పెడు చంద్రహాసమును ♦ యోధులు మెచ్చఁగఁ జేతఁ దాల్చి తా
నప్పునఁ గోరుసేనలకు ♦ నాజ్ఞయొసంగెను ధాటితోఁ జనన్. 36

తే. అపుడు భేరీవిరావముల్ ♦ హర్షమొసఁగఁ
బటహకాహళ రవములు ♦ పర్వమిడియె
వీరభట సింహనాదముల్ ♦ వేడ్కఁ గొలిపెఁ
జటులతర ధాటితో నేగె ♦ సైన్యచయము. 37

క. అంతన్విజయేంద్రుఁడు దా
నెంతయుఁ బ్రవిమలపుభక్తి ♦ నీశ్వరుమదిలోఁ
జింతించి యుద్ధమునకై
స్వాంతమ్ము డరంగ నపుడు ♦ సన్నాహుండై. 38

ఉ. చెంగున నెక్కి గుఱ్ఱమును ♦ జేతను ఖడ్గము దాల్చి సేనలన్
సంగరధాటికిం గొలిపి ♦ చాయతరంబగు ధంధణార్భటిన్
బొంగుచు వెంట నంటిచనె ♦ భూరిపరాక్రమ రేఖశోభిలన్
సింగము హస్తిపైఁ జనెడు ♦ చెన్నున వీరుల నెచ్చరించుచున్. 39

తే. శౌరివిజయేంద్రులివ్విధి ♦ సమరమునకు
వచ్చువిధమును విని సార్వ ♦ భౌముఁ డంత
వీరరణధీరు విజయేంద్రు ♦ పైకి నుఱుకఁ
బంచి శౌరినిఁ దాఁ దాఁక ♦ నెంచి యపుడు. 40

ఉ. తెల్లనితేజి నెక్కి కడుఁ ♦ దెల్లనిదుస్తులఁ దాల్చి మేనిపైఁ
దెల్లనికాంతు లీనునాక ♦ దివ్యశరంబను ఖడ్గమూనితన్
గొల్లఁగ సేన లెంతయును ♦ గొల్వఁగ నేగెను ఢంఢమార్భటిన్
జల్లన వైరిగుండెలు వె ♦ సన్ బగులంగను శౌర్యమూర్తియై. 41

క. తన వెంటను రణధీరుఁడు
గొని వేలకొలంది బలముఁ ♦ గుపితుండగుచున్
ఘనుఁడగు విజయేంద్రునిపైఁ
జనియెన్ క్షోణీతలంబు ♦ చలియించుగతిన్. 42

ఆ. చక్రవర్తిసేన ♦ చను దెంచెనో లేదొ
శౌరియడరుఁడనుచు ♦ సైన్యములకు
నాజ్ఞసేసి తాను ♦ నత్యంత శౌర్యంబుఁ
జూపఁదొడఁగె రిపుల ♦ యేపుదఱఁగ. 43

చ. నిముసములోన శీర్షములు ♦ నిండె రణాంగణమందు నెత్తురో
యమితముగాఁ బ్రవాహమయి ♦ యంతటఁ బాఱఁగఁజొచ్చె నేలపై
సమదగజంబులుం దొరలెఁ ♦ జప్పునఁగూలెను ఘోటకావళుల్
ప్రమదము మీఱ శౌరితన ♦ భవ్యబలంబును మెచ్చె నార్చుచున్. 44

చ. అదిగని సార్వభౌముఁడు మ ♦ హాగ్రహమున్ వహియించి యద్దిరా
మదమని యార్చి ఘోరముగ ♦ మారొక్కని తా నుఱుమాడఁజొచ్చినన్
జెదరెను వైరిసైన్యములు ♦ చెచ్చెర శౌరినిఁ బట్టె నాతఁడున్
మెదలక వాల్చి శీర్షమును ♦ మేదినిఁ జూచుచుఁ బోయె దాయతోన్.

తే. ఇట్లు శౌరినిఁ జెఱఁగొని ♦ యెనక మెసఁగ
సార్వభౌముఁడు రణధీరు ♦ సలుపుదురముఁ
గనెడు వేడుక నావంకఁ ♦ జనియె నౌర!
జయము చింతల మఱపింపఁ ♦ జాలునుగద. 46

చ. అటు రణధీరుఁ డుగ్రుఁడయి ♦ యవ్విజయేంద్రుని దాఁక నాతఁడున్
బటుతర బాహుశక్తియును ♦ భవ్యపరాక్రమ లీలఁ జూపినన్
బటిమను వీడి చేవచెడి ♦ పాఱెను ఫౌజులు దండనాథుఁడున్
గటకట ! యెట్టిపాటనుచుఁ ♦ గ్రచ్చఱసేన మరల్చె నాజికిన్.

తే. మేఘములఁ బోలెఁ గ్రమ్ముచు ♦ మీఁదికెగసి
వచ్చువైరులకును జండ ♦ వాయువట్టు
లేచి పోఁద్రోసి యవ్విజ ♦ యేంద్రుఁ డార్చె
మాతుఁ డొక్కింత చింతిల్లి ♦ మరలఁద్రోసె. 48

తే. కొండవలె మీఁదఁ బడుశత్రు ♦ కోటి కెల్లఁ
దాను శతకోటివలె నిల్చి ♦ తఱిమివైచి
పొల్చె నవ్విజయేంద్రుఁడు ♦ భూరియశుఁడు
మరగియును వైరిదంతుల ♦ మఱలఁగొలిపె. 49

తే. చీఁకటులు గ్రమ్మినట్టులు ♦ చిత్రరీతి
నన్ని దెసలను శత్రువు ♦ లలమికొనినఁ
బ్రబలతేజంబు చేవానిఁ ♦ బాఱఁద్రోలి
వఱలె విజయేంద్రుఁడా గ్రీష్మ ♦ భానుపగిది. 50

తే. ఎన్నిమాఱులు ద్రోసిన ♦ నన్నిమాఱుల్
తఱుముచుండెడు విజయేంద్రు ♦ ధాటిఁజూచి
వెగ్గలిన రణధీరుని ♦ భీతిమాన్పి
సార్వభౌముఁడు శౌర్యంబుఁ ♦ జక్కఁగొల్పె. 51

ఉ. ఆరణధీరుఁ డప్పుడు మ ♦ హాహవదోహలుఁడై చెలంగుచున్
జేరి రణాంగణంబు తన ♦ చేతికొలందిగ వైరిసేనలన్
దారుణరీతిఁ గూల్చియు గ ♦ దన్ విజయేంద్రుఁడు పూనితాఁకిన
న్బాఱెను నొక్కటేపరుగు ♦ నన్ రణధీరుఁడు భీరువై వడిన్. 52

తే. అంతనసహాయ శూరుఁడై • యలరువాని
వీరు నవ్విజయేంద్రుని • విజయసముని
శౌర్యమును మెచ్చి నృపపతి • సత్కరింప
నెంచి యాతనికడకుఁదాఁ • బంచెనొకని. 53

తే. పంప నవ్విజయేంద్రుఁడు • భవ్యయశుఁడు
దాను గోరినవెల్లను • దారమతిని
నిచ్చుకోరిక గలదేని • వచ్చెదనని
చెప్పిపంపిన మందారుఁ • డొప్పియంత. 54

తే. అతనిఁగొనిరాఁగ రణధీరు • నంపెనాతఁ
డెంతయును వైభవంబున • నిభముమీఁద
సంతసము మీఱఁగాఁదెచ్చి • చక్రవర్తి
కడకుఁజేర్చిన నాతఁడు • గడుఁబ్రియమున. 55

తే. చారుతర పీఠమొసఁగియో • శౌర్యజలధి
నిన్నుఁబోలినవీరునే • నెన్నఁడుఁగనఁ
గోరు నీకోర్కెలెల్లను • గూర్చిసిత్తు
ననిన విజయేంద్రుఁడెంతయు • హర్షమందె. 56

క. తెఱనున్న మాన్యపాలుని
ధరణీధవచంద్రు వదలి • దయచూపుమనన్
సరగునశౌరిని నాతని
సరసన్ రప్పించియుంచె • సమపీఠమునన్. 57

ఆ. అంతసార్వభౌముఁ • డవ్విజయేంద్రుని
నెలమితోడఁగని మ • ఱేమికోర్కె
కలదొ తెలుపుమన్నఁ • గరకంజములు మోడ్చి
నను ననుగ్రహింపు • జనకనొసఁగి. 58

తే. అనిన నాశ్చర్యమగ్నుఁడై ♦ యన్న రేంద్రుఁ
డన్న! నీవంటిశూరునిఁ ♦ గన్నవానిఁ
దెలుపుమన విజయేంద్రుఁడు ♦ దేవవినుము
ధర్మపాలుఁడు నాతండ్రి ♦ ధర్మమూర్తి. 59

తే. అనినహర్షంబు నాఁపంగ ♦ నలవిగాక
గద్దియనుడిగ్గి విజయేంద్రుఁ ♦ గౌఁగిలించి
సింహమున కెప్పుడునుభువి ♦ సింహమెకద
పుట్టుననియుబ్బి పలుక్రుచు ♦ భూవరుండు. 60

తే. తత్క్షణంబున రప్పించి ♦ ధర్మపాలు
నచటి విజయేంద్రునింజూపి ♦ యార్యవినుత
నిన్నుఁజెఱనుండి విడిపింప ♦ నెన్నఁగాని
భూరిశౌర్యంబుఁ జూపిన ♦ పుత్రుఁడిదిగో. 61

తే. అనిన జనకునివరపాద ♦ వనజములను
వ్రాలి విజయేంద్రుఁడానంద ♦ వార్ధిమున్గి
మత్తరోలంబరాజంబు ♦ మాడ్కినున్నఁ
బలికె జనకుండు తనయులే ♦ వంగనెత్తి. 62

ఉ. వింతగ శౌర్యమున్నెఱపి ♦ వీరవరేణ్యులు మెచ్చఁబోరియ
త్యంతము దావహంబగు మ ♦ హాయశముంగడియించి మించినట్
శాంతమహాసముద్రమున ♦ సారెకుఁ దేలఁగఁజేసి తౌరనీ
వెంతటివాఁడవైతి విజ ♦ యేంద్రకుమార వివేకసాగరా ! 63

తే. అనుచుఁగౌఁగిటఁజేర్చియో ♦ యనుఁగుబిడ్డ
భద్రభద్రమ సరళకు ♦ భవ్యయశకు
సేమమాయన వినిసార్వ ♦ భౌముఁడపుడు
వగచుచును ధర్మపాలుని ♦ మొగముఁజూచి. 64

తే. భద్రనడిగెదు నీవు నా ♦ భవ్యచరిత
జాడ దెలిసినఁ జెప్పవే ♦ సాధువినుత
యనిన నేనేమెఱుంగను ♦ దనయుఁడితఁడు
దెలిసియుండంగ నోపును ♦ దేవ యనిన. 65

తే. సార్వభౌముఁడు విజయేంద్రు ♦ సరగఁజూచి
భద్రజాడ యెఱుంగుదే ♦ భవ్యకీర్తి
యనిన భూపాలురిర్వురు ♦ నలరనిట్లు
తెలిపె విజయేంద్రుఁ డంతయుఁ ♦ దేటపడఁగ. 66

క. మీరలు జనకునిఁ జెఱఁగొన
హారావళిఁ జేరియుంటి ♦ మచ్చటనేనుఁ
జారుమతి మాతసరళయుఁ
గారుణ్యాంబునిధిభద్ర ♦ గడపుచు దినముల్. 67

క. మాత సుశిక్షను బెరిఁగితి
నా తల్లియనుజ్ఞఁ గాంచి ♦ యటరంగపురీ
నేతను శౌరినిఁ జేరితి
నీతీరునఁ గార్యజాత ♦ మెల్లనడపితిఁ. 68

క. ఇంతకు భగవంతునిదయ
యెంతయుఁ గారణముగాన ♦ నెచ్చినభక్తిఁ
జింతింతము మనమనముల
నింతింతనరాని యట్టి ♦ యీశ్వరమహిమల్. 69

తే. అనిన నుర్వీశులిర్వురా ♦ యనఘు మెచ్చి
శౌరికెంతయు సత్కృతి ♦ సలిపిరంత
సరళభద్రలఁ గొనిరాఁగ ♦ సంభ్రమమునఁ
బైఁడి యందలముల సార్వ ♦ భౌముఁడంపె. 70

ఆ. అంతఁ జక్రవర్తి • యాధర్మపాలునిఁ
జూచియిట్లులనియె • శుద్ధచరిత
పెట్టరానిపాట్లఁ • బెట్టినవాఁడను
అంతకుఁడను ఘోర • హంతకుఁడను. 71

తే. సరళ నాకారణమ్మున • జాలిఁబడియె
భద్రినాకతమునఁ జాల • బాధపడియె
శౌరిననుఁబట్టి యింతక • ష్టమ్మువడియె
నకట! యిన్నిటికిమూల • నైతినేను. 72

ఆ. అనుచుఁ బరితపించు • నాసార్వభౌముని
వంతఁ జూచి ధర్మ • పాలుఁడంతఁ
గీడులోన మేలు • గెలిచెనుపర మేశు
మఱచి యిట్లుమీరు • మఱుఁగఁదగునె. 73

తే. అనుచునోదార్చె నంతట • నందఱిరిగి
మాళవేంద్రుని నగరాన • మానవతుల
సరళ భద్రిలరాకకై • చాలఁదమిని
నెదురు చూచుచునుండిరు • ర్వీశతిలక. 74

సీ. అక్కడఁ గొండడనై • నొక్కదినమ్మునఁ
బురుషుఁ డొక్కఁడువచ్చి • సరళఁ జూచి
యమ్మ ! చొక్కపుసైఁడి • యుంగలమ్ములు రెండు
సార్వభౌముఁడు పంపె • సరగ మీకు
ననినలోఁ గలఁగియు • నామెధైర్యమునూని
కమ్మరయ్యెద్దనను • గలదెయనిన
విజయేంద్రుఁడన్నహా • వీరుఁడిచ్చెనుదీని
ననుచుఁ జేతను బెట్టె • నతఁడు లేఖ

నంతహర్షలతయు ♦ నాభద్రిలరుదెంచి
కమ్మ రెవరువ్రాసి ♦ రమ్మయనుచుఁ
దన్నుఁజేరి మిగులఁ ♦ దమితోడ నడిగిన
సరళ బిగ్గరగను ♦ జదివెనిట్లు. 75

తే. అమ్మ! సర్వేశుకరుణచే ♦ నమరెజయము
సార్వభౌముఁడు జనకుని ♦ సత్కరించె
నెల్లరము మీదురాకకై ♦ యెదురుచూచు
చున్నవారము. ఇదిపుత్రి ♦ విన్నపమ్మ. 76

కవిరాజవిరాజితము.

అనివినిపించిన ♦ నందఱు నీశ్వరు ♦ నప్పుడుచిత్తసరోజములన్
గనికొనియాడిరి ♦ గానముచేసిరి ♦ కాలముపుచ్చిరి ప్రార్థనలన్
ననలనుదాల్చిరి ♦ నవ్వులఁదేలిరి ♦ నవ్యఫలాళి భుజించివెసన్
మనములరంగను ♦ మాళవభూమికి ♦ మానినులేగఁ దొడంగిరటన్.

ఆ. భద్రహర్షలతలు ♦ బాగుగానొకయంద
లమ్మునెక్కసరళ ♦ నెమ్మిమీఱ
నొక్కయందలమ్ము ♦ నెక్కెనుబోయలు
ననలఁబోలె మోచి ♦ కొనుచుఁజనిరి. 78

ఆ. కొంతసేపుభద్రఁ ♦ గూడికూర్చుండును
గొంతసేపు సరళఁ ♦ గూడియుండు
నిట్లు హర్షలతయు ♦ నిద్దఱకును హర్ష
మిడుచునుండెఁ గూర్మి ♦ నెడపడప. 79

తే. హర్షలత తన్నుఁ జేరిన ♦ యపుడుభద్ర
బాల! చూడవె యిదినీవు ♦ పడ్డచోటు
అదిగో విజయేంద్రుఁ డప్పులి ♦ నట్టెచంపె
యాతన్యానిన్ను రక్షించి ♦ నట్టిచోటు. 80

ఆ. అనిన హర్షలతయు ♦ నామె వంకను జూచి
నాదు జనకుకడను ♦ నన్నుఁ గూర్చి
యద్దయాకరుండు ♦ హర్షంబు మీఱఁగాఁ
జెప్పియుండు నేమొ ♦ చిత్రచరిత. 81

తే. అనిన నాభద్ర కోడలి ♦ నలరఁ జూచి
యమ్మ నినుఁ గూర్చి యేమియు ♦ నతఁ డెఱుఁగఁడు
గాన నెట్టులు దెలుపంగఁ ♦ గలఁడు చెపుమ
కాక యాతఁడు నిష్కామ ♦ కార్యపరుఁడు. 82

తే. అమ్మహాత్ముని సుగుణగ ♦ ణమ్ము లెన్న
నలవిగా దాతనికి సాటి ♦ యతఁడె జగతి
నన్నయెఱుఁగఁడు నీవిట ♦ నున్న మాట
యందలమ్ముల రెంటి నే ♦ యంపియుంట. 83

ఆ. అనిన హర్షలతకు ♦ నవ్విజయేంద్రుని
యందుఁ జెప్పఁగాని ♦ యంత ప్రేమ
మనసునందుఁ గలిగె ♦ మఱియది పొంగె నాఁ
గనులనుండి జాఱెఁ ♦ గంకణములు. 84

తే. అంతఁ దా హర్షలతవోయి ♦ యా సరళను
సరస సల్లాపములఁ దేల్చి ♦ చారుఫణితి
మాళవము చేరవగుటను ♦ మరలి వచ్చి
పట్టరానట్టి తమితోడ ♦ భద్రఁ జేరె. 85

తే. అన్న తన్నెట్లు చూచునో ♦ యనెడు భీతి
భద్ర వెలవెలఁ బోయిన ♦ బాల చూచి
యత్త నినుఁ గూర్చి మా తండ్రి ♦ యడలుచుండు
నీవు భయపడకమ్మ ని ♦ న్నెమ్మిఁ గాంచు. 86

తే. అనుచునోదార్చుచుండఁ బూ ♦ ర్వాద్రి కడకు
నేఁడువింతలలో వింత ♦ నెగడునంచుఁ
జూచువేడ్కను జను దెంచె ♦ సూర్యుఁడంతఁ
బల్లకులు రెండు పురములో ♦ పలికివచ్చె. 87

తే. సరళయుండిన పల్లకి ♦ సత్వరముగ
ధర్మపాలుని మేడకుఁ ♦ దరలిపోయె
హర్షలత భద్రిలుండిన ♦ యందలమ్ము
నార్యభామిని సౌధరా ♦ జమును జేరె. 88

తే. ధర్మపాలుఁడు శౌరితోఁ ♦ దనయుతోడ
సరళరాక నిరీక్షించి ♦ సంభ్రమమున
మెట్లదరినిల్చి యుండ నా ♦ మెలఁతమిన్న
పల్లకినిడిగ్గి యోలమితో ♦ భర్తఁగాంచి. 89

తే. కాళ్ళఁదానాశ్రు కన్నీటఁ ♦ గడుగుచుండ
ధర్మపాలుఁడు హర్షాశ్రు ♦ ధారచేత
నామె కభిషేకమొనరించి ♦ యులరుచుండి
యెంతయును బ్రీతితోనెత్తి ♦ యిట్లుపలికె. 90

చ. పరమపతివ్రతాసరళ ♦ భవ్యచరిత్రవు నీవుపుత్రునిన్
నిరుపమ శౌర్యవంతునిగ ♦ నిర్మలధర్మ పథానువర్తిఁగాఁ
గరమనురక్తిఁజేసితివి ♦ కష్టములన్నిటి కోర్చిభర్తదా
శరణమొసంగి నట్టిసతి ♦ సర్వవిధంబులఁ బ్రోచిమించితో. 91

తే. అనినఁ బతిఁ జూచిసరళయో ♦ యమలచరిత
యినునికిరణాళి యెంతయు ♦ నిందునందుఁ
బ్రతిఫలించెడు కరణిస్వ ♦ భావముగను
బతిగుణమ్ములె సతియందుఁ ♦ బ్రతిఫలించు. 92

తే. అనియనంతరమునఁ దన ♦ యన్న కెరఁగి
యుచితరీతిని నుపకృతి ♦ నుగ్గడించెఁ
వినయుఁడెంతయు భక్తితోఁ ♦ దనకు మ్రొక్కఁ
బ్రకట కరుణాకటాక్షమా ♦ లికలఁ దనిపె. 93

తే. అంతనందఱు భర్మహ ♦ ర్మ్యాగ్రమందుఁ
జేరి భగవంతు ననుపమ ♦ చిత్రమహిమ
లెంచి యెంతయు నెలమితో ♦ నెసఁగుచుండి
రిచట రారాజు భద్రకై ♦ యెంతయుఁ దమి. 94

తే. మోసలను వేచియుండఁగా ♦ ముదముమీఱ
నందలముఁ దెచ్చిదించిరి ♦ యందునుండి
మించుమించినయట్టులు ♦ మెలఁత యొకతె
వచ్చితనమీఁదఁ బడుచువి ♦ భ్రమముఁ గొలిపె. 95

తే. ఇంతలో భద్రతన కాళ్ళ ♦ కెరఁగినిలిచె
నట్లుతనమీఁదఁ బడినయా ♦ యన్నుమిన్న
నతఁడు చక్కఁగ నీక్షింప ♦ హర్షలతగ
నగపడిన మగ్నుఁడయ్యెమ ♦ హాద్భుతాబ్ధి. 96

తే. మాటిమాటికిఁ జూచును ♦ మాటలుడుగు
సత్యమో లేక యిది నాకు ♦ స్వప్నమో యను
వ్యాఘ్రముఖమునఁ బడినట్టి ♦ బాలయేడ
బ్రదికివచ్చుట యిదియేడ ♦ భ్రాంతియనును. 97

తే. ఇట్లుకొంత వితర్కించి ♦ యెదుటనున్న
హర్షలతఁ జూచి నిజముగా ♦ హర్షలతవె
యనిన నాహర్షలతయనె ♦ జనకుఁ గాంచి
యంతకంతకు నాశ్చర్య ♦ మతిశయిల్ల. 98

తే. హర్షలత నేను నాఁడు ని ♦ న్నడవిలోన
వదలి హయమెక్కి పోవుచో ♦ వ్యాఘ్రముఁ గని
బెదరి గుఱ్ఱము ననుఁ గడు ♦ వేగముగను
దూరముగఁ దీసికొనిపోయి ♦ త్రోసె నవని. 99

తే. మూర్ఛవోయితి నంతలోఁ ♦ బులి మహోగ్ర
గతిని గుఱ్ఱంబుపై దూఁకి ♦ గండుమీఱి
చంపి భక్షించుచుండెను ♦ జనక వినుము
మీఁదికత యత్త తెలుపును ♦ మీరు వినుఁడు. 100

తే. అనిన మందారుఁ డోభద్ర ♦ యాగ్రహంబు
నెల్ల విడనాడి మన్నించి ♦ యెలమితోడ
నింతయును దీఁకంతయు ♦ నెఱుకసేసి
మోదవార్నిధిలోపల ♦ ముంపవమ్మ. 101

తే. అనిన సాదరమున భద్ర ♦ యన్న వినుము
నీవు కినిసిన కతమున ♦ దేవదేవు
మహిమ యెంతయుఁ జూచెదు ♦ మహిమ నాకుఁ
బట్టెఁగావున మీకుఁ గ్రొ ♦ త్తఙ్జురాల. 102

సీ. మీరలు ధర్మపాలు నటు ♦ మించి చెలఁగఁగొన నేను నా విధిఁ
దూఱుచుఁ బొక్కుచున్న నను ♦ దుఃఖమునుండి తరింపఁ జేయఁగాఁ
గూరిమి మాళవేంద్రుసతి ♦ గొబ్బున నా కభయంబు నిచ్చి తా
ధీరతఁ బుత్రితోడ నను ♦ దీనను దోకొనిపోయి కానలోఁ. 103

క. హారావళి గిరిపై మను
ధారాళంబైన కరుణఁ ♦ దద్దయుఁ బ్రోచెన్
ధీరుగ రణశూరునిగను
దారునిగాఁ జేసెఁ దనయు ♦ ధర్మాత్మునిగాన్. 104

క. తనయన్న శౌరిసాయముఁ
గని మీఁపైఁ గవిసి జయుముఁ ♦ గాంచి తన పతిన్
గొనిరమ్మని విజయేంద్రునిఁ
దన తనయుని నంపె నతఁడు ♦ ధైర్యోద్ధతుఁడై. 105

క. చని గిరి దిగి కాననమునఁ
గని గుజ్జుఁ దినెడు పులిని ♦ ఖండించి వడిన్
గనుఁగొనె నచ్చెరువందిన
మనమున మూర్ఛిల్లినట్టి ♦ మన హర్షలతన్. 106

ఆ. అంత మరలి జనని ♦ కంతయుఁ దెల్పిన
నతనివెంట వచ్చి ♦ హర్షలతను
సరళ దేర్చి కాచె ♦ సాధ్వీశిరోమణి
యామె సుగుణగణము ♦ లేమిచెపుదు. 107

తే. మీఁదివృత్తాంత మెల్లను ♦ మీకెఱుక
యనుచుఁ దెల్పిన మందారుఁ ♦ డలరి యలరి
యమలభద్రిను దాఁగొని ♦ యాడియాడి
నెమ్మిలో హర్షలత తల ♦ నిమిరి నిమిరి. 108

చ. తనపరువేమి చూడక యు ♦ దారత మాళవపాలు పాలికిన్
జని సరళాసతీమణికిఁ ♦ జక్కఁగఁ జాఁగిలిమ్రొక్కి సాధ్విరో
నిను నుతియింపనేరతునె ♦ నేరములెల్ల క్షమింపవమ్మ నా
యనుజతనూజలన్ మనిచి ♦ నట్టి కృపామృతవార్ధి వమ్మరో.

క. అను సార్వభౌముఁ గనుఁగొని
యనఘా నీ విట్లు మమ్ము ♦ నగ్గింపంగాఁ
జనునే పరమేశ్వరు కృప
మనయందఱపైనఁ గురియ ♦ మనుదుముగాదే. 110

క. అని సరళపలుకు నాతఁడు
గనుఁగొని విజయేంద్రు వంకఁ • గారుణ్యనిధీ
నిను నేమని పొగడుదు నా
తనయకుఁ బ్రాణంబు నిడిన • దాత విధాతా. 111

ఆ. అనినఁ దెల్లపోయి • యవ్విజయేంద్రుఁడు
సార్వభౌముఁ జూచి • సత్యముగను
నేను గావలేదు • నీపుత్రి నెప్పుడు
నూరకేల నన్ను • నుగ్గడింప. 112

ఆ. అనినఁ దనయఁ జూచి • యానరళాదేవి
నాఁడు పులినిఁ జంపి • నాకు నీవు
మూర్ఛమున్గినట్టి • పొలఁతిఁ జూపితిగద
యామె యితని సుతర • హర్షలతర. 113

ఆ. అనినఁ దల్లిపలుకు • లాలించి విజయేంద్రుఁ
డూరకుండె నంత • నుచితరీతి
ధర్మపాలునరసి • దయశౌరిఁ గన్గొని
చక్రవర్తి మరలె • సౌధమునకు. 114

ఆ. అంత భద్ర వచ్చి • యున్నను దాఁ జూడ
నెంత చిత్రమమ్మ • యీసుమహిమ
యనుచు దేవుఁ దలఁచి • యాసార్వభౌముండు
భద్రకిట్టులనియె • భవ్యఫణితి. 115

ఆ. తల్లి పూజ్యురాలు • తండ్రియు ధన్యుండు
ఎల్లసుగుణములకు • నిల్లుఁ బోలి
యలరుచుండు పుత్రిఁ • డవ్విజయేంద్రుఁడు
వీరి చుట్టరికము • విజయకరము. 116

తే. హర్షలత విజయేంద్రుని ♦ హర్షమతిని
దనకుఁ బ్రాణంబొసంగిన ♦ ధన్యయశుని
సేవియగుటకు నొప్పునే ♦ తెలుపుమనిన
నన్న! యతఁడన్నఁ బ్రాణమ్ము ♦ హర్షలతకు. 117

తే. అనుచు భద్ర యోజింగింప ♦ నాత్మనలరి
సచివురణధీరుఁ బిలిచి యో ♦ సఖుఁడ పోయి
కనుఁగొనుము ధర్మపాలునిఁ ♦ గలసిమెలసి
వేడ్కగల దేమొ నాతోడ ♦ వియ్యమంద. 118

తే. అనుచు మందారుఁ డంపిన ♦ నయ్యమాత్యుఁ
డేగి మాళవభూపతి ♦ నేకతమునఁ
గలసి సంగతులన్నియుఁ ♦ దెలుప నతఁడు
సతిసుతులఁ గాంచి యోజించి ♦ సమ్మతించె. 119

సీ. ఆవార్తఁ జెవిసోఁక ♦ నా సార్వభౌముండు
హర్షమ్ముతోఁ బొంగి ♦ యతులగతుల
నగరంబుఁ గై సేసి ♦ నరనాథు లందఱ
రప్పించి విడుదుల ♦ నొప్పునుంచి
శృంగారలక్ష్మి వ ♦ సించు మందిరమునఁ
బెండ్లిమండపమును ♦ వింతఁ గూర్చి
వివిధవాద్యమ్ములు ♦ విమల స్వనమ్ముల
వీనులవిందుగా ♦ వింపఁజేసి
హర్షలత హర్షలతయైన ♦ నలరునట్లు
మణిమయాభరణమ్ముల ♦ మహిమగొలిపి
భద్రితనకెంతయును సాయ ♦ పడుచునుండ
జనులనందఱ నానంద ♦ జలధిఁ దేల్చె. 120

తే. అంతయును సిద్ధమని తెల్పు ♦ నదురువేట్లు
పేళ్లు భేరీరవంబులు ♦ లీలమ్రోయ
సర్వభూషణములఁ దాల్చి ♦ సంభ్రమించి
ప్రీతిఁ దలిదండ్రులకు మ్రొక్కి ♦ పెండ్లికొడుకు. 121

సీ. కుంజరమ్ముల నెక్కి ♦ కూర్మితో నిరువంకఁ
దండ్రియు శౌరియుఁ ♦ దరలిరాఁగఁ
బైఁడియందల మెక్కి ♦ పరమసంతోషానఁ
బూజ్యురాలౌ మాత ♦ పొల్చిరాఁగ
నాశ్వికుల్ వెనుముందు ♦ నత్యంత భక్తితో
నంగరక్షకులయి ♦ యలరిరాఁగఁ
బూర్ణచంద్రుఁడు నింగిఁ ♦ బొంగితఁ జూడఁగా
బ్రజలు వేడుక తోడ ♦ బలసిరాఁగ
భద్రకరిమీఁద మణిమయ ♦ ప్రభలనీను
పసిఁడియంబారి పైనుత్స ♦ వమున వెడలి
వైభవమ్మున శ్రీసార్వ ♦ భౌము గృహము
వచ్చి చేరెను మంగళ ♦ వాద్యమొలయ. 122

ఆ. అంతఁ జక్రవర్తి ♦ యవ్విజయేంద్రుని
సంభ్రమమునఁ దెచ్చి ♦ చారుమండ
పమునఁ జేర్చె నంత ♦ భవ్యతేజముతోడ
హర్షలతయు వచ్చి ♦ యమలభక్తి. 123

తే. కరుణఁ గాంచిన విజయేంద్రు ♦ చరణములను
జారువీక్షణపుష్పమం ♦ జరుల చేతఁ
బూజలొనరించి యొనరించి ♦ పూర్ణమైన
తనకృతజ్ఞతఁ జూపుచుఁ ♦ దనరుచుండె. 124

సీ. అప్పుడాచార్యుఁడ ♦ య్యాండజి హృదయానఁ
బరమేశ్వరుని భక్తిఁ ♦ బాదుకొల్ప
ధ్రువతారఁ బోలుచు ♦ ధ్రువముగా గార్హస్థ్య
ధర్మమ్ము లోపలఁ ♦ దనరుఁడంచు
నావసిష్ఠుని తోడి ♦ యా యరుంధతిమించి
యన్యోన్యమును బ్రీతి ♦ నలరుఁడనుచు
నెల్లరుదీవించి ♦ యెలమితోఁ బువ్వులు
జల్లునఁ దమమీఁదఁ ♦ జల్లుచుండఁ
వధువువరుఁడును భగవంతు ♦ భక్తిఁదలఁచి
దృఢతరంబగుమతినిఁ బ్ర ♦ తిజ్ఞ సలిపి
పాణిపీడనమును సప్త ♦ పదిని జరపి
పెద్దలకుమ్రొక్కి పొల్చిరి ♦ పీఠములను. 125

ఉ. అప్పుడు రాజులందఱును ♦ హర్షముతోఁదను జూచుచుండఁగాఁ
జప్పునరాజరాజుతన ♦ చారుకిరీటముఁ దీసిప్రీతితో
నొప్పుగనల్లుశీర్షమున ♦ నూర్జితరీతినిఁ జక్రవర్తివై
యొప్పుమటంచుఁబెట్టెఁదనఁ ♦ యోగ్యతనందఱు మెచ్చునట్లుగాఁ

ఆ. అంతఁగుసుమవర్ష ♦ మంతటఁగురిసెను
విజయభేరిమ్రోసె ♦ వేడ్కఁగొలిపె
జనులునలుపునట్టి ♦ జయజయనాదముల్
కొలఁదిమీఱెభద్ర ♦ కోర్కిఁదీరె. 127

తే. హర్షలతవిజయేంద్రుల ♦ హర్నిశంబు
నేకహృదయంబుతోఁబర ♦ మేశుఁగొల్చి
ప్రజలసౌఖ్యాబ్ధిఁ దేల్చుచుఁ ♦ బ్రబలుచుండి
శుభములెల్లనుబడసిరి ♦ సూర్యభూప. 128

తే. ధర్మపాలుఁడవీవుని ♦ ధర్మపత్ని
యెన్న సరళయె యవ్విజ ♦ యేంద్రుఁడనఁగ
నీను పుత్రుండు గావున ♦ నిఖిలశుభము
లిచ్చి ప్రోచుత మిముఁబర ♦ మేశ్వరుండు. 129

మాలిని.

సురుచిరగుణమూ ర్తీ ♦ శుద్ధమార్గప్రవర్తీ
విరతపరిజనార్తీ ♦ విద్వదానందమూర్తీ
అరితతిసమవర్తీ ♦ హర్షరాజానువర్తీ
పరమధవళకీర్తీ ♦ భక్తిసౌధాగ్రవర్తీ. 130

గద్య.

ఇది శ్రీ పరమేశ్వరకరుణాకలితలలితకవితాకలిత శ్రీ రామల
క్ష్మాంబా బుచ్చివేంకయామాత్యతనూజాత సకలసజ్జనవిధేయ
ఆదిపూడి సోమనాథనామధేయ ప్రణీతంబయిన శ్రీ
విజయేంద్ర విజయంబను సుప్రబంధంబునందు
సర్వంబును జతుర్థాశ్వాసము
సంపూర్ణము.



Sujanaranjani Printing Works, Cocanada.